మన పొట్లపహాడ్
పొట్లపహాడ్ గ్రామ చరిత్ర

బుక్ డిజైన్:
బ్రహ్మం భావన గ్రాఫిక్స్
హైదరాబాద్ 9848254745

ముద్రణ:
కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్
హైదరాబాద్

ప్రతులకు:
**చైతన్య బుక్ స్టోర్స్**
వాణిజ్య భవన్ సెంటర్,
సూర్యాపేట.

**యగ్గడి శ్రీనివాస్** (టీచర్)
ఇం.నెం. 3-97/23, రోడ్ నెం.2,
వీధి నెం.1, ద్వారకవెంకటసాయి నగర్,
శనీశ్వర టెంపుల్ దగ్గర, మునగనూర్,
హయత్‌నగర్, హైదరాబాద్-501511
ఫోన్: 9441945245

**బోధి ఫౌండేషన్**
కొత్తపేట, హైదరాబాద్-35
9848254745

వెల: రూ. 50/-

---

పుస్తక ప్రచురణకు సమాచారాన్ని, సహాయసహకారాలు అందించిన గ్రామపెద్దలు, ఉద్యోగులు, యువకులు ఇంకా ఎందరో మిత్రులు. అందరికీ మా హృదయపూర్వక కృతజ్ఞతలు

-మన పొట్లపహాడ్ గ్రామ ఐక్య సమాఖ్య

**G. JAGADISH REDDY**
Minister for Energy

Room No 237, 1st Floor, D-Block,
Telangana Secretariat
Phones: 040-23450520 (O)
040-23453212






Hyderabad
Date: 02.10.2019

## అభినందన సందేశం

జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి అన్నది ఆర్యోక్తి. స్వర్గం కన్నా కన్నతల్లి, పుట్టిన ఊరు గొప్పవని అర్థం. పొట్లపహాడ్ గ్రామ ప్రజలు తమను పెంచిపెద్దచేసి, జీవితంలో నిలదొక్కుకోవడానికి తోడ్పాటునందించిన పుట్టిన ఊరి రుణం తీర్చుకోవడం కోసం తమ చరిత్రను అక్షరబద్ధం చేయడం సంతోషకరం.

పల్లెలు దేశానికి పట్టుకొమ్మలు, పల్లెలు ప్రగతి సాధిస్తే దేశంకూడా పురోగతి సాధిస్తుంది. స్వచ్ఛమైన, ఆరోగ్యవంతమైన సమాజాన్ని నిర్మించాలని జాతిపిత మహాత్మాగాంధి కలలు కనేవారు. పొట్లపహాడ్ గ్రామ యువత తమకు వారసత్వంగా వస్తున్న గ్రామ ఆచారాల, పండుగల, వ్యవసాయరంగం తదితర సకల వివరాలతో 'మన పొట్లపహాడ్' పుస్తకం ప్రచురించడం చక్కటి ప్రయత్నం.

పొట్లపహాడ్ గ్రామానికి ఆ పేరు ఎలా వచ్చిందో తెలిపే కథ ఆసక్తికరంగా వుంది. చారిత్రక అంశాలతో పాటు, గ్రామ పెద్దలు ద్వారా సేకరించిన విషయాలను ఈ పుస్తకంలో సవివరంగా అందించారు. తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు అయ్యాక ముఖ్యమంత్రి కె.చంద్రశేఖర్‌రావు గారి సారథ్యంలో తెలంగాణ పల్లెలు ప్రగతిబాట పట్టాయి. మౌలిక సదుపాయాల రూపకల్పనలో దేశంలోనే మన రాష్ట్రం ముందుంది. ప్రభుత్వ పథకాలను అందిపుచ్చుకుని పొట్లపహాడ్ గ్రామం అన్ని రంగాల్లో సమగ్రాభివృద్ధిని సాధించాలి.

సొంతలాభం కొంత మానుకు పొరుగువారికి తోడుపడవోయ్ అన్నమాటలు పాటిస్తూ, తాము ఎదుగుతూ, గ్రామం కూడా ప్రగతిబాటలో సాగాలనుకే ప్రజలున్న పొట్లపహాడ్ గ్రామం ఎన్నో గ్రామాలకు ఆదర్శం కావాలి. పొట్లపహాడ్ గ్రామం సూర్యాపేట జిల్లాలోనే ఉత్తమ గ్రామంగా నిలవాలని కోరుకుంటూ, ఈ పుస్తకాన్ని ప్రచురించిన బోధి ఫౌండేషన్ మరియు మన పొట్లపహాడ్ గ్రామ ఐక్య సమాఖ్య వారిని మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.

జగదీష్ రెడ్డి.
గుంటకండ్ల జగదీశ్‌రెడ్డి



పుస్తక ప్రచురణకు ఆర్థిక సహకారాన్ని అందించిన సహృదయులు, పొట్లపహాడ్ గ్రామాభివృద్ధికై నిరంతరం తపనపడే
**శ్రీ ఎడవెల్లి రవీందర్‌రెడ్డి**
**శ్రీమతి నిర్మల గార్లకు**
మా హృదయపూర్వక కృతజ్ఞతలు

**-మన పొట్లపహాడ్ గ్రామ ఐక్య సమాఖ్య**

# తొలి అడుగు...



## మా మాట

కన్నతల్లికి సాటి
అన్నపూర్ణకు మేటి
ఎన్ని తరముల నాటిదో
మా ఊరు
ఎన్ని వరముల తోటిదో!

జన్మనిచ్చిన ఊరు గురించి, అక్షరాలు దిద్దించిన బడి గురించి, ఆటలాడుకున్న బజార్ల గురించి బోలెడన్ని జ్ఞాపకాలు సొంతూరుని తలచుకున్నప్పుడల్లా మదిలోకొస్తాయి. అమ్మానాన్నలు పెద్దవాళ్ళయిపోయి, మనము ఉపాధి కొరకు పట్నాలకు వచ్చేశాము. స్నేహితులేమో ఎవరిదారి వారు చూసుకొని స్థిరపడిపోయారు. వృత్తి ఉద్యోగ, వ్యాపారాల్లో మనము తలమునకలై పోయాం. క్రమంగా మనకు మన ఊరుకు బంధం తెగిపోతుంది.

మన గ్రామస్థులు ఉద్యోగ, వ్యాపార పరంగా ఎంత ఎదిగినా మన గ్రామానికి, కుటుంబానికి ఎంతో విలువ ఇస్తాము. మనం ఎక్కడ ఉన్నా, ఏ పని చేస్తున్న పండుగల సమయంలో గ్రామానికి వచ్చి వేడుకలను ఘనంగా జరుపుకుంటాం. ఒకతరం వరకూ ఫర్వాలేదు. ఆర్నెల్లకోసారో, ఏడాదికోసారో రాకపోకలు ఉంటాయి. రెండో తరానికి వచ్చేసరికి మన ఊరు కాస్తా, నాన్న గారి ఊరుగా మారిపోయింది. మూడోతరానికి వచ్చేసరికి ఊరు పూర్తిగా పరాయిదైపోయింది. పూర్వీకుల స్వగ్రామంగా మిగిలిపోయింది.

పల్లెను మరచిపోవడం అంటే మూలాల్ని మరిచిపోవడమే. ప్రతి ఊరుకు ఒక కథ ఉంటుంది. పల్లెకో చరిత్ర ఉంటుంది. ఎవరో ఒకరు చెప్పకపోతే ఆ విషయాలు మన ఊరి పిల్లలకు ఎలా తెలుస్తాయి.

పల్లె మెచ్చుకొంటే... అమ్మ మెచ్చుకున్నట్టే, నాన్న భుజం తట్టినట్టే, మన గ్రామం నుండి వివిధ ప్రాంతాలలో హైద్రాబాద్ నుండి అమెరికా దాకా స్థిరపడిన మనవాళ్ళు చాలామంది ఉన్నారు. ఇలా మన గ్రామానికి సంబంధించిన ప్రతి విషయాన్ని, సందర్భాన్ని ప్రస్తావిస్తూ రాబోయే తరాల కొరకు మన ఊరు విశిష్టతను తెలియజేసే సదుద్దేశ్యంతో మన పొట్లపహాడ్ పుస్తకం రూపొందించాం.

ఇందులో పొందుపరిచిన సమాచారం ఊరిపెద్దల నుంచి సేకరించడం జరిగింది. ఇదే ప్రామాణికమని మేము భావించడం లేదు. సమాచారంలో లోపాలు ఏమైనా వుంటే మా దృష్టికి తీసుకువస్తే తదుపరి ముద్రణలో సవరించుకుంటాం.

కృతజ్ఞతలతో...

**మన పొట్లపహాడ్ గ్రామ ఐక్య సమాఖ్య**





# చరిత్ర

## పొట్లపహాడ్ గ్రామ చరిత్ర

కలిమి బలిమిల గ్రామ తొలి పొద్దు కోసం బలి ముద్ద కొరకై పోరాటములు సల్పి. ఆత్మబలిదానముల హారతిపట్టిన పోరాటయోధుల వీరగడ్డ. తెలంగాణా సాయుధ పోరాట వీరయోధులగన్న విప్లవోద్యమాల పోరుగడ్డ. పోరాట పటిమకు స్ఫూర్తిగడ్డ. పోరువిద్యలందు పోటీలుపడు పోరాటాల పల్లె పొట్లపహాడ్!

### చారిత్రక నేపథ్యం

కాకతీయులకు సామంతులుగా రేచర్ల వంశ రెడ్డి రాజులు పిల్లలమర్రి, ఉండ్రుగొండ ఉర్లుగొండ కూడలి దోసపాడు నాగులపాడు లాంటి పలు ప్రాంతాలను పరిపాలించారు. వీరి కాలంలో చాలా ప్రాంతాల్లో ఎన్నో గొప్ప దేవాలయాలను నిర్మించారు. అందులో భాగంగా నాగులపాడులో నిర్మితమైన దేవాలయాలు అద్భుతమైన శిల్పకళా

సంపదతో అపురూపమైన శిల్పకళాశోభితమై అలరారుచున్నవి. క్రీ.శ.1280లో కామేశ్వర దేవాలయ ప్రతిష్ఠాపన సందర్భంగా ఐతాంభిక పుత్రుడైన రేచర్ల కామిరెడ్డి వేయించిన శాసనం, ఇంకా కామిరెడ్డి కామసాని దంపతుల కుమారులైన గంకిరెడ్డి, మల్లారెడ్డిలు వేయించిన శాసనాలను బట్టి రేచర్ల వంశీ రెడ్డి రాజులు సాంస్కృతిక కళాసేవాభిలాశులుగా, కళాపోషకులుగా ప్రసిద్ధి చెందారు. అట్టి అపూర్వమైన దేవాలయాలకు నెలవైన నాగులపాడులో అంతర్భాగంగా అవిభాజ్యంగా ఈ పొట్లపహాడ్ గ్రామం ఉన్నట్లు తెలుస్తోంది. కాలక్రమేణా తర్వాత ఒక ప్రత్యేక గ్రామంగా పరిణామం చెందిఉండవచ్చు. చారిత్రాత్మకమైన, దేవాలయాలు శాసనాల ద్వారా ఈ ప్రాంతం చరిత్ర ప్రాధాన్యత సంతరించుకుందిగా తెలుస్తుంది. ( ప్రముఖ చరిత్ర పరిశోధకులు డా: భిన్నూరి నరసింహశాస్త్రి (బి.యన్. శాస్త్రి) గారి నల్లగొండ మండల సర్వస్వం గ్రంథాన్ని అనుసరించి సేకరించిన సమాచారం.)

### జనశృతిలో గల కథనాలు

చారిత్రక అంశాలను ప్రామాణికతను పక్కన పెడితే ఈ గ్రామం గురించి తరతరాలుగా మౌఖికంగా వినవస్తున్న, ప్రచారంలో ఉన్న కథనాలను బట్టి గ్రామం ఏర్పడిందని పూర్వీకుల నమ్మకం విశ్వాసం.

### పొట్లపాడ్ పొలి పొడిచినా పోదు

జనశృతిలో గల ఒక కథనాన్ని అనుసరించి పూర్వం పొట్లపహాడ్ గ్రామానికి చెందిన ముగ్గురు యువకులు తమ గ్రామం సుభిక్షంగా ఉండాలని సంకల్పించి పొరుగు గ్రామము లో జరుగుతున్న బొడ్రాయి పండుగ లో భాగంగా సకల శుభాలనిస్తుందని నమ్మికగల బలిముద్దను చేజిక్కించుకొని పొట్లపహాడ్‌కు పరుగెత్తగా, వారిని నాగులపాడు వారు ఆయుధాలతో వెంబడించారు. ఆ క్రమంలో చేతిలో బలిముద్దగల యువకుడు దానిని మిత్రుడికిచ్చి ఈ ముద్దను ఎలాగైనా మనగ్రామంలో పొలి చల్లమని ఆదేశించాడు. వెంటబడి వస్తున్న వాళ్ళను అడ్డగించి



వీరోచితంగా వారితో పోరాడి కత్తులకు బలయ్యాడు. (అతని ప్రాణత్యాగానికి ప్రతీకగా నిర్మితమైనదే వీరన్న దేవుడి గుడి)

మిత్రుడి మాట ప్రకారం బలిముద్దను గ్రామంలో పొలిచల్లిన పిదప ఆ యువకుల్ని కూడా తమ కత్తులతో పొడిచారు. తీవ్రంగా గాయపడిన ఆ యువకుడు ప్రాణాలొదులుతూ "ఒరేయ్ పొట్లపాడ్ పొలి పొడిచినా పోదు. నాగులపాడు పంట ఒక్క రోజు వంట" అని అన్నాడు. కొంతదూరం వెళ్ళాక మరో యువకుడిని కూడా పొడిచి చంపారని అప్పటినుండి ఇది ప్రజల్లో నానుడిగా మారి ప్రస్తుతం వీరన్నగడ్డగా ప్రసిద్ధి చెందినది.

నాగినేనిపల్లి పాఠశాల తెలుగు ఉపాధ్యాయుడు మండల స్వామి గారి పి.హెచ్.డి. పరిశోధనాగ్రంథం 'నల్లగొండ జిల్లా గ్రామ నామాల చరిత్ర' ఆధారంగా పూర్వం ఈ గ్రామస్తులు యుద్ధవిద్యల్లోను, ఎడ్లు, గుర్రాలు, గొర్రెపొట్టేళ్ళ పందెంలలో ఇతర గ్రామాల వారితో పోటీ పడటం మరియు పోటీలు నిర్వహిస్తుండటంతో ఈ గ్రామం పోటీలపాడుగా కాలక్రమేణా అది పొట్లపహాడ్‌గా రూపాంతరం చెంది ఉండవచ్చు అని తెలుస్తోంది.

### భౌగోళిక స్వరూపం

సహజసిద్ధమైన ప్రకృతి ఒడిలో సస్యశ్యామల సకల సౌభాగ్యాలతో సుభిక్షంగా వర్థిల్లుతుందీ గ్రామం. సూర్యాపేట జిల్లా కేంద్రానికి 20 కిలోమీటర్ల దూరంలో ఉన్న ఈ గ్రామం తెలంగాణా రాజధాని హైదరాబాద్‌కు 150 కిలోమీటర్ల దూరంలో ఉన్నది. గ్రామానికి తూర్పున ఆంజనేయ స్వామి దేవాలయం, పశ్చిమాన వీరన్నగడ్డ, లాల్ బహదూర్ కాలువ, పెద్ద చెరువు, ఉత్తరాన అనంతారం, దక్షిణాన అన్నారం గ్రామం హద్దులుగా గలవు. ఊరి మధ్యలో పీర్ల కొట్టం, దర్గా, మసీదు, ఊరి ప్రారంభంలో చర్చిలతో సర్వమత సంగమస్థలిగా నిలిచింది. గ్రామంలో గల చిన్న చెరువు, ఊరగుంట, యరడ్లబావి, బుడ్డబావి, స్తంభాలబావి, నిమ్మచెట్లబావి, రావిచెట్లబావి, పెద్దంబావి, రాఘయ్యబావి, సారబావి

మొదలైన బావులు ఊరిలో రకరకాల పంటలకు నీటినందిస్తూ ఇప్పటికీ సజీవ సాక్ష్యాలుగా మిగిలాయి. అంతేగాక ఇవి ఈతకొలనులుగా, గాలాలతో చేపలు పట్టేవారికి ఇవి మత్స్య నిలయాలుగా ఇప్పటికీ నిలిచి ఉన్నాయి. ఊరికి తూర్పునగల మరొక బావి సారబావి. ఈ బావిలో విషాన్నైనా అమృతంగా స్వీకరించే దైవత్వం ,అందరి మైలలను కడిగేస్తూ కులమత బేధాల కళంకం అంటని, మోక్షప్రదాయని పవిత్ర గంగా స్వరూపిణి ఇది.

## గ్రామ ప్రముఖులు

నిజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా సాయుధ రైతాంగ పోరాటం చేసిన యోధులెందరో ఈ గ్రామంలో ఉన్నారు. అదేవిధంగా సుధీర్ఘ కాలం గ్రామ సర్పంచులుగా పనిచేసిన నారాయణ జానకిరామ్ రెడ్డి, రామినేని సోమయ్యలు ఆదర్శంగా నిలిచారు. గ్రామంలో అక్షరాభ్యాసాల శ్రీకారాలు చుట్టిన చల్లని పుల్లయ్య సారులాంటి ఉపాధ్యాయులెందరో... ఎందరో నిరక్షరాస్యులైన పాలెగాండ్లను అక్షరాస్యులుగా మలిచిన వురిమళ్ల వెంకట బ్రహ్మంసారు శ్లాఘనీయులు. ఇంకా గ్రామంలో నాయకులుగా, ఉపాధ్యాయులుగా, ఉద్యోగస్తులుగా వివిధ రంగాలలో దేశవిదేశాల్లో సేవలందిస్తూ, వృత్తి వ్యాపారవేత్తలుగా, విద్యా వంతులుగా పలురంగాలలో ఉన్నత స్థానాల్లో స్థిరపడి గ్రామ కీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింపజేసిన అందరూ నిత్య స్మరణీయులు.

సేకరణ, రచన:
జిల్లేపల్లి జానయ్య (టీచర్)
కట్ల మధుసూదన్ (టీచర్)



## తెలంగాణ సాయుధ పోరాటంలో మన గ్రామ వీరులు

సామాన్యులే సాయుధులై భారతదేశ చరిత్రలో మహోజ్వల ఘట్టం... తెలంగాణ సాయుధ పోరాటం. రాచరికం, భూస్వామ్య వ్యవస్థ, మతోన్మాదంపై ఏకకాలంలో సాగిన ఉమ్మడి సమరమది.

నిజాం నిరంకుశానికి భూస్వాముల అరాచకానికి, రజాకార్ల రాక్షసకాండకు వ్యతిరేకంగా జరిగిన ఉధృత సాయుధ పోరాటమిది. సామాన్యులే సాయుధులై చేసిన ప్రతిఘటన ఇది. రైతులు ఎదిరించి విద్యార్థులు ఉద్యమించి మాతృమూర్తులు నడుంబిగించి అణచివేతపై పేదవాడు తన కోపాగ్నినే అంకుశంగా ఎక్కుపెట్టిన చిరస్మరణీయ యుద్ధమిది.

విమోచనా... విలీనమా... అనే మీమాంసలు, శషభిషలు ఎన్ని ఉన్నా మొత్తంగా చరిత్రలో ఇదో విలక్షణ పోరాటం. సామాన్యులే ఇంతగా త్యాగాలు చేసిన అరుదైన ఉద్యమమని చరిత్రకారులు చెబుతారు. అందుకే తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం భారతదేశ చరిత్రలో అపురూపమైన స్థానం దక్కించుకుంది.

భూమి కోసం... భుక్తి కోసం... విముక్తి కోసం... సాగిన తెలంగాణ సాయుధ పోరాటం అత్యంత విలక్షణమైంది. ఇది నిజాం నిరంకుశ పాలనకు, వెట్టి చాకిరీకి, దోపిడీకి వ్యతిరేకంగా జరిగిన సమరమే కాదు... అణచివేతను సహించలేని ప్రజల సామూహిక తిరుగుబాటు. పీడితుల పట్ల సానుభూతితో పిడికిలి బిగించి పోరాడిన ఒక తరం చరిత్ర. బాల్యం నుంచే వేలాది మందిని ఉద్యమం వైపు ఆకర్షితులను చేసిన మహత్తర పోరాటం. మహిళలు సైతం కొంగు బిగించి బందూకులు చేపట్టిన మహోజ్వల ఘట్టం. అనేక నిర్భంధాలు, దాడులు, దౌర్జన్యాలు, చిత్రహింసలను ఎదుర్కొని... ప్రాణాలను సైతం లెక్కచేయకుండా నిజాం రాచరికానికి, భూస్వాముల పెత్తనానికి వ్యతిరేకంగా పోరాడి ప్రపంచంలో ఎందరికో స్ఫూర్తినిచ్చిన ఉద్యమం.

తెలంగాణ రైతాంగ సాయుధపోరాటంలో మన గ్రామం నుండి చల్లా అప్పారెడ్డి, బెక్కం బిక్షమయ్య, గుత్తికొండ నర్సిరెడ్డి, గుత్తికొండ నర్సమ్మ, యగ్గడి చిన లింగయ్య, నారాయణ వెంకటరెడ్డి, నారాయణ చెన్నారెడ్డి, నారాయణ సాంబారెడ్డి, యడవెల్లి సాంబారెడ్డి, యడవెల్లి చినవెంకటరెడ్డి, నారాయణ జానకిరాంరెడ్డి, నల్లగొండ కాశయ్య, చింతకుంట్ల బిక్షం మొదలగు మన గ్రామ పెద్దలు పాల్గొని తుపాకీ తూటాలను ఎదుర్కొని, జైలు నిర్బంధం అనుభవించి కఠినమైన శిక్షలకు గురైనా కూడా అలుపెరగకుండా పోరాటం చేశారు.




## జనాభా

పొట్లపహాడ్ గ్రామం తెలంగాణ రాష్ట్రంలోని పెన్‌పహాడ్ మండల పరిధిలో ఉంది. సూర్యాపేట జిల్లా కేంద్రానికి 20 కి.మీ. దూరంలో మండల కేంద్రానికి 4 కి.మీ. దూరంలో ఉంది.

మాచారం, పెన్‌పహాడ్, దోసపహాడ్, లింగాల గ్రామాల పరిసర గ్రామాల సమీపంలో ఉన్నది. దీనికి పడమర వేములపల్లి, ఉత్తరాన చివ్వెంల, సూర్యాపేట మండలాలు, దక్షిణాన నేరేడుచర్ల మండలం,తూర్పున గరిడేపల్లి మండలం విస్తరించి ఉన్నాయి.

సూర్యాపేట, మిర్యాలగూడ, కోదాడ, నల్లగొండ పట్టణాలకు సమీపంలో వుంది. అసెంబ్లీ నియోజకవర్గం సూర్యాపేట, పార్లమెంటు నియోజకవర్గం నల్లగొండలుగా ఉన్నాయి.



గూగుల్ మ్యాప్స్‌లో
మన పొట్లపహాడ్

| వివరములు | మొత్తము | పురుషులు | స్త్రీలు |
|---|---|---|---|
| మొత్తం ఇండ్లు | 498 | - | - |
| జనాభా | 1812 | 900 | 912 |
| పిల్లలు (0-6) | 121 | 69 | 52 |
| యస్.సి. | 494 | 256 | 238 |
| యస్.టి. | 0 | 0 | 0 |
| అక్షరాస్యత | 64.87% | 74.37% | 55.70% |

### పొట్లపహాడ్ 2011 జన గణన

| | |
|---|---|
| జనాభా | 1812 |
| నివాసాలు | 498 |
| స్త్రీల జనాభా | 50.3% (912) |
| అక్షరాస్యత | 60.5% (1097) |
| స్త్రీల అక్షరాస్యత | 26.4% (479) |
| యస్.టి. | 0.0% |
| యస్.సి. | 27.3% (494) |

### కులాల వారిగా మన గ్రామ ఇండ్లు

| | | |
|---|---|---|
| రెడ్డి - 85 | పెరిక -70 | గౌడు-55 |
| యాదవ్-42 | వడ్రంగి, కంసాలి-10 | చాకలి-10 |
| మంగలి-8 | వంశీరాజు-8 | కుమ్మరి-10 |
| పద్మశాలి-2 | కర్ణం-1 | వైశ్య-1 |
| మాల-57 | మాదిగ-81 | ముస్లీం-35 |
| మాస్టీని-5 | | |

### గ్రామంలోని ప్రస్తుత ఓటర్లు :

| | |
|---|---|
| పురుషులు | 722 |
| స్త్రీలు | 767 |
| మొత్తం | 1489 |





### పట్వారీ వ్యవస్థ:

మన గ్రామానికి చెందిన తడకమళ్ల కనకాలరావు గ్రామ పట్వారీగా పనిచేశారు. ఆయన తర్వాత వారి కుమారుడు వెంకటరంగారావు పట్వారీగా పనిచేశారు.

### పోలీస్ పటేల్ వ్యవస్థ

గ్రామంలో ఎలాంటి గొడవలు జరగకుండా చూసుకోవడం, గ్రామస్థుల మధ్య ఏమైనా గొడవలు వచ్చినప్పుడు పోలీస్‌స్టేషన్‌కు గ్రామానికి అనుసంధానకర్తగా వ్యవహరించి సమస్యలను పరిష్కరించేవారు.

రామనేని సోమయ్య (ఎర్రకుంట), రామనేని అప్పయ్య, రామనేని సైదయ్య, యగ్గడి పెదలింగయ్య, దాచేపల్లి కృష్ణయ్య, నారాయణ పోలీస్ పటేల్లుగా వ్యవహరించారు. నారాయణ పుల్లారెడ్డి మాలీ పటేల్‌గా, తడకమళ్ల లక్ష్మీనర్సింహ్మారావు పనిచేశారు. 1984 జనవరి 1న అప్పటి ముఖ్యమంత్రి యన్.టి. రామారావు పట్వారీ వ్యవస్థను రద్దుచేశారు.

# గ్రామ పంచాయితీ

పొట్లపహాడ్ 1959 సంవత్సరంలో గ్రామపంచాయితీ ఏర్పాటైంది. గ్రామ మొదటి సర్పంచిగా నారాయణ జానకిరాంరెడ్డి ఎన్నికైనారు. రామినేని సోమయ్య రెండు పర్యాయాలు ఏక గ్రీవంగా ఎన్నికైనారు.

| | | |
|---|---|---|
| నారాయణ జానకిరాంరెడ్డి<br>1959-1964 | నారాయణ వెంకటరెడ్డి<br>1965-1969 | నారాయణ శ్రీనివాస రెడ్డి<br>1970-1981 |
| రామినేని సోమయ్య<br>1981-1991 | రామినేని పుష్పావతి<br>1991-1996 | ఆదిమల్ల పార్వతమ్మ<br>2001-2006 |
| మేకపోతుల పిచ్చయ్య<br>2006-2013 | నారాయణ సునీత<br>2013-2018 | రామినేని పుష్పావతి<br>2019 జనవరి నుండి |



## మన గ్రామం నుంచి యం.పి.టి.సి.లుగా ఎన్నికైనవారు

| | | |
|---|---|---|
| బోయ గురువారెడ్డి<br>1995 - 2001 | గొబ్బి పద్మ<br>2001 - 2006 | రామినేని పుష్పావతి<br>2006, 1 నెల వరకు |
| బెక్కం వెంకటమ్మ<br>2006 - 2011 | నూకల రాజ్యలక్ష్మి<br>2013 - 2019 | మేకపోతుల సైదమ్మ<br>2019 జూన్ నుండి |

❖ 2006-2011 వరకు మన గ్రామానికి చెందిన రామినేని పుష్పావతి పెన్‌పహాడ్ మండల జడ్.పి.టి.సి.గా పనిచేశారు.

❖ 2005 సం॥లో రామినేని పుష్పావతి ఒక నెలకాలం పెన్‌పహాడ్ మండల పరిషత్ అధ్యక్షురాలిగా పనిచేశారు.

---

సూదిరెడ్డి సత్యనారాయణరెడ్డి నారాయణగూడెం పి.ఎ.సి.యస్. చైర్మన్‌గా, పెన్‌పహాడ్ మండల కాంగ్రెస్ పార్టీ అధ్యక్షులుగా పనిచేశారు. వీరి భార్య శ్రీమతి సూదిరెడ్డి శంకరమ్మ సూర్యాపేట మున్సిపల్ కౌన్సిలర్‌గా ఎన్నికై గ్రామానికి గుర్తింపు తెచ్చారు.

# ఊరు - తీరు

## మన వ్యవసాయం

మన గ్రామంలో అనాదిగా ఎక్కువగా జొన్నలు, సజ్జలు, రాగుల పంటలు పండించేవారు. మన గ్రామం వ్యవసాయ ఆధారిత గ్రామం. సాగునీరు లేక రైతులు మెట్టపంటలు ఎక్కువగా పండించేవారు. మన దేశ మొదటి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ నాగార్జునసాగర్ డ్యామ్ నిర్మాణంతో వ్యవసాయానికి సాగునీరు అందుబాటులోకి వచ్చింది. కానీ మన గ్రామ







భూములన్ని ఎడమకాల్వకు ఎగువ ప్రాంతంలో ఉండటం వల్ల సాగర్ కాలువనీరు పారుగంత లేకుండా పోయింది. అప్పుడు మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా పనిచేస్తున్న జలగం వెంగళ్‌రావు ప్రభుత్వం ఎడమకాలువ కింద 1972లో లిఫ్ట్ ఇరిగేషన్ ఎత్తిపోతల పథకాన్ని ప్రారంభించింది. 1974 నుండి కాలువ ఎగువ భూములకు సాగునీరు అందుబాటులోకి వచ్చింది. అప్పటినుండి మన గ్రామ పరిధిలోని వ్యవసాయ భూములు అన్నారం, అనంతారం లిఫ్టులుగా ఏర్పాటు చేసి వరిసాగు ఎక్కువగా చేశారు. లిఫ్టు ఇరిగేషన్ చైర్మన్‌లుగా మన గ్రామానికి చెందిన రామనేని సోమయ్య కొంతకాలం తర్వాత రామినేని కృష్ణయ్య కొంతకాలం పనిచేశారు. ఆనాటినుండి ఇప్పటివరకు సంవత్సరానికి ఖరీఫ్, రబీ పంటలుగా వరి పంట పండిస్తూ కాలానుగుణంగా వ్యవసాయంలో అధిక దిగుబడులు సాధిస్తున్నారు.

## సారబాయి

గ్రామంలో మొదటినుంచి ఈత నేర్చుకోవడానికి ఉపయోగపడిన బావి సారబావి. ఇది దొరవారి బావి. దాదాపు ఊరిలోని వారంతా దొరోరి బావిలో ఈత నేర్చుకున్నవారే. ఇప్పటికీ ఈ బావి కులమతబేధాలకు అతీతంగా  అంత్యక్రియల తదనంతర మైలలను కడిగేస్తూ మోక్ష ప్రదాయినిగా నిలుస్తోంది.

## మన గ్రామ విద్య

మన గ్రామపంచాయితీ 1959 సంవత్సరంలో ఏర్పాటైనట్లు మన గ్రామ పెద్దలు చెబుతారు. గ్రామ పంచాయితీ ఏర్పాటైన తర్వాత సూర్యాపేట సమితిలో మొట్టమొదట మన గ్రామం 1967 జూన్ నెలలో విద్యుత్‌లైన్లు ఏర్పాటుచేసి విద్యుదీకరణ జరిగిన గ్రామంగా ముందుంది. అప్పటి మన గ్రామసర్పంచ్ కీ॥శే॥ నారాయణ జానకిరాంరెడ్డి, కీ॥శే॥ నారాయణ వెంకటరెడ్డి గ్రామానికి కరెంటు సౌకర్యం కల్పించడానికి కృషిచేశారు. అప్పటినుండి మన గ్రామం విద్య, ఉద్యోగ రంగాలలో అభివృద్ధి చెందుతూ వస్తోంది.

మన గ్రామంలో ప్రాథమిక విద్యను అభ్యసించడానికి పాఠశాల లేదు. ఆరోజుల్లో నారాయణ వెంకటరెడ్డి, నారాయణ సత్యనారాయణరెడ్డి, ఎదుళ్ల అంజిరెడ్డి వంటి వారు మాచారం గ్రామానికి చెందిన అన్నపుశాస్త్రి గారి వద్ద విద్యనభ్యసించారు. అప్పట్లో గురుదక్షిణగా తవ్వెడు బియ్యం, పావలా, అర్ధరూపాయి ఇచ్చేవారట. ఆయన శిష్యరికం చేసినవారిలో చాలామంది ఉపాధ్యాయులుగా, వివిధ రంగాల్లో స్థిరపడ్డారు.

కాలక్రమంలో 1954 సం॥లో కీ॥శే॥ నారాయణ సాంబారెడ్డి ఇంటి కొట్టంలో ఒకటి, రెండు తరగతులతో పాఠశాలను ప్రారంభించారు. ఆ తరంలో సైదులుసార్ సుమారు పద్దెనిమిది సంవత్సరాలు ఎంతో



అంకితభావంతో పనిచేసి పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పించారు. 1955 సం॥లో తిరిగి దొరవారికొట్టంలో పుల్లయ్య సార్ ఇంటి దగ్గర పాఠశాలను ఏర్పాటు చేశారు. అదే పాఠశాలను 1975 సం॥లో ప్రభుత్వం ఇప్పుడున్న పక్కా భవనంలో ప్రాథమిక పాఠశాలగా ప్రారంభించారు. ముందుగా మూడవ తరగతి వరకు మాత్రమే బోధన జరిగేది. తర్వాత కీ॥శే॥ నారాయణ వెంకటరెడ్డి సార్ కృషితో 6వ తరగతి వరకు పెంచారు. 1990 సంవత్సరంలో రిటైర్డ్ టీచర్ నారాయణ సత్యనారాయణరెడ్డి ప్రయత్నం వల్ల ప్రాథమికోన్నత పాఠశాల ఏర్పాటైంది.

ఉన్నత విద్యకోసం మన గ్రామం నుండి 1978 వరకు 8,9,10 తరగతులకు అనంతారం గ్రామంలో ఉన్నత విద్యను చదివేవారు. 1978 తర్వాత అన్నారం బ్రిడ్జిదగ్గర ఉన్నత పాఠశాల ఏర్పాటుకాగానే మన గ్రామంలోని విద్యార్థులందరూ 6 నుండి 10వ తరగతి వరకు చాలామంది అక్కడే చదువుకున్నారు.

### శేషగిరిరావుసార్ బడి

మన గ్రామంలో 1975 నుండి 1985 మధ్యకాలంలో అప్పట్లో ప్రభుత్వ పాఠశాలల్లోనే విద్యనభ్యసించేవారు. అప్పటి ఉపాధ్యాయులు ఎక్కువగా పనిచేసే పాఠశాల ఊరిలోనే స్థానికంగా ఉండి ఉత్తమ బోధన



చేసేవారు. మన గ్రామంలో 1975 సంవత్సరంలో తాళ్లూరి శేషగిరిరావు, అనంతలక్ష్మి దంపతులు ప్రైయివేటుగా చదువు చెప్పడానికి వచ్చారు.

తాళ్లూరి శేషగిరిరావు మన గ్రామంలో మొదటగా కీ॥శే॥ రామినేని సైదయ్య గారి ఇంట్లో ప్రాథమిక విద్య, ఉన్నత తరగతుల వారికి ట్యూషన్లు బోధించేవారు. ఆయన శిష్యులందరికీ మంచి విద్యాబుద్ధులు, విలువలతో కూడిన చదువులు ఎంతో చక్కగా బోధించేవారు. ఆయన శిష్యరికంలో ఎంతోమంది ఉన్నత విద్యనభ్యసించి మంచి స్థాయిలో స్థిరపడ్డారు.

శేషగిరిరావు సారు శిష్యులలో కీ॥శే॥ మేకపోతుల లింగయ్య, కీ॥శే॥ చల్లా విద్యాసాగర్‌రెడ్డి, కీ॥శే॥ చల్లా రామకృష్ణారెడ్డి, నారాయణ పితాంబర్‌రెడ్డి, నారాయణ వినోద, నారాయణ శారద, నారాయణ హిమాకర్‌రెడ్డి, నూకల ఇందిర, నూకల మాధవరెడ్డి, ఎదుళ్ళ వసంత, ఎదుళ్ళ సుకన్య, ఎదుళ్ల నరేందర్‌రెడ్డి, నారాయణ నిర్మల, నారాయణ జ్యోతి, నారాయణ ప్రేమ్‌సాగర్‌రెడ్డి, నారాయణ దయాసాగర్‌రెడ్డి, గుత్తికొండ ప్రభావతి, గుత్తికొండ త్రివేణి, నారాయణ పద్మ, నారాయణ వీరారెడ్డి, నారాయణ శంకర్‌రెడ్డి, బోయ హైమావతి చల్లా వెంకటరెడ్డి, చల్లా మంజుల, చల్లా శోభ యగ్గడి శ్రీనివాస్, సోమిరెడ్డి సీతారాంరెడ్డి, యడవెల్లి సంజీవరెడ్డి, నారాయణ సాంబారెడ్డి, నారాయణ శ్రీధర్‌రెడ్డి, యడవెల్లి లక్ష్మారెడ్డి, ఎడవెల్లి ప్రభాకర్‌రెడ్డి, యడవెల్లి సాంబారెడ్డి, బంగారు సుధాకర్, మజ్జిగపు భాస్కర్‌రెడ్డి, మజ్జిగపు వెంకటరెడ్డి, మజ్జిగపు సాగర్‌రెడ్డి,



మజ్జిగపు హైమావతి, యగ్గడి విమల, బంగారు బ్రహ్మం, పఠాన్ ఉస్మాన్‌ఖాన్, చల్లా వేణుధర్‌రెడ్డి, చల్లా రమాదేవి, చల్లా సుమతి, చల్లా సరిత, మేకపోతుల సైదులు, పుట్టల సైదులు, నర్సయ్య, యల్లంల పర్వతాలు, కట్ట వెంకన్న, యగ్గడి గాంధీ, గోళ్ళ శ్రీనివాస్, యగ్గడి శ్రీనివాస్, యగ్గడి గురునాథం, నారాయణ ఉమ, నారాయణ సాంబారెడ్డి, నారాయణ రాంరెడ్డి, గుత్తికొండ శ్రీదేవి, బంగారు అరుణ, జ్యోతి, శారద, నారాయణ కవిత, నారాయణ సరస్వతి, నారాయణ లక్ష్మి, నారాయణ పార్వతి.

దాదాపుగా వందమంది పైగా 1975 నుండి 1985 దశాబ్దకాలం పాటు సారు శిష్యులకు నైతిక విలువలతో కూడిన విద్యను అందించారు. వారికి తెలుగుభాష చక్కగా రాయడం, చదవడం, పద్యకంఠస్థం, తిథులు నక్షత్రాలు, తెలుగు సంవత్సరాలు, గణితంలో చతుర్విధ ప్రక్రియలు ఎంతో నైపుణ్యంతో నేర్పి విద్యావంతులుగా తీర్చిదిద్దారు. కేవలం చదువే కాకుండా ఆటలు, పాటలు, సాంస్కృతిక రంగాలలో వారికి తర్ఫీదునిచ్చేవారు. సారు మార్గదర్శనంలో మన గ్రామంలో 1970-1980లలో ఒక తరం విద్యార్థులు చక్కగా చదువుకుని నేడు డాక్టర్లుగా, ఇంజనీర్లుగా, ఉపాధ్యాయులుగా ఉన్నత స్థాయిలో వివిధ రంగాలలో స్థిరపడ్డారు.



కేవలం విద్యార్థులకు విద్యా బుద్ధులు మాత్రమే కాకుండా 1978 రాష్ట్రప్రభుత్వం అక్షరాస్యతను పెంపొందించేందుకు చేపట్టిన వయోజన విద్య కార్యక్రమంలో భాగంగా మన గ్రామంలోని చదువురాని పెద్దవాళ్ళు, జీతగాళ్లు, యువకులను అక్షరాస్యులుగా తీర్చిదిద్దారు. ఏమాత్రం అక్షరజ్ఞానంలేని మేకపోతుల బక్కమ్మ, కత్తి రామచంద్రు లాంటి ఎందరో నిరక్షరాస్యులకు చదువు నేర్పించారు.

## కళారంగం

గ్రామంలో కళారంగంలో ఎంతోమంది కళాకారులను గుర్తించి నాటకాలు ప్రదర్శించారు. 1980 ప్రాంతంలో 'సురభి నాట్యకళా మండలి' వారు గ్రామ గ్రామాన నెలలపాటు వుండి గొప్పగొప్ప పౌరాణిక, జానపద, సాంఘిక నాటకాలు వేసేవారు. ప్రతిసంవత్సరం బాగోతపు వాళ్లు వచ్చి దొరవారి గడీ ముందు ప్రదర్శనలు ఇచ్చేవారు. తెల్లవార్లూ ప్రదర్శించే బాగోతాలని గ్రామ ప్రజలంతా తండోపతండాలుగా వచ్చి చూసేవారు. ఆ రోజుల్లో సినిమాలు అంతగా అందుబాటులో లేనందున, ప్రజలకు వినోదం పంచడానికి నాటకాలు గ్రామల్లో ప్రదర్శించేవారు. దాని స్ఫూర్తితో మన గ్రామంలో శేషగిరిరావు సారు ఆధ్వర్యంలో, చెన్న కృష్ణారెడ్డి లాంటి గురువుల ప్రోత్సాహంతో బోయ గురువారెడ్డి మేకపోతుల శ్రీరాములు, బంగారు సత్యనారాయణ, బంగారు లక్ష్మణాచారి, దాచేపల్లి






కోటేశ్వర్‌రావు, చల్లా వెంకటమ్మ, బంగారు పుల్లయ్య శ్రీరామంజనేయ యుద్ధం, పూలరంగడు, ఏక్‌దిన్‌కా సుల్తాన్ తదితర నాటకాలు ప్రదర్శించారు. కొత్తతరంలో యగ్గడి శ్రీనివాస్, యల్క సైదులు, యడవెల్లి సంజీవరెడ్డి, యడవెల్లి ప్రభాకర్‌రెడ్డి, నారాయణ శ్రీధర్‌రెడ్డి, యడవెల్లి లక్ష్మారెడ్డి, మజ్జిగపు భాస్కర్‌రెడ్డి, సయ్యద్ హుస్సేన్, నారాయణ సాంబారెడ్డి, టి. కృష్ణ ఆర్‌ఎంపి తదితరులు కళారంగంలో తమసేవలు అందించారు.

గ్రామంలో బిల్ల వీరయ్య ఇంటి ఆవరణలో 16ఎం.ఎం. ప్రొజెక్టర్‌తో తెలుపు నలుపు చిత్రాలు ప్రదర్శించేవారు. టికెట్‌పై ప్రదర్శించే ఆ సినిమాలను గ్రామస్థులు చూసి ఆనందించేవారు.



శేషగిరిరావు సారు అప్పట్లో బాల్‌బ్యాడ్మింటన్, కబడ్డీ టీమ్‌లు ఏర్పాటు చేసి చుట్టుపక్కల గ్రామాలలో జరిగే టోర్నమెంట్స్‌లో గెలిచి షీల్డ్స్ గెలుపొందేవారు. ఒక సంవత్సరం గ్రామ కబడ్డీ టీమ్ జిల్లా స్థాయిలో ప్రథమ బహుమతి గెలుచుకున్నది. ఈ టీంలోని మేకపోతుల లింగయ్య, మేకపోతుల శంకర్, గుత్తికొండ సత్యనారాయణరెడ్డి, బెక్కం వెంకన్న, యడవెల్లి జనార్దన్‌రెడ్డి, గుత్తికొండ సుదర్శన్‌రెడ్డి, యడవెల్లి సంజీవరెడ్డి, బంగారు లక్ష్మణాచారి, బంగారు మదనాచారి సభ్యులుగా వున్నారు. ఆ రోజుల్లో గ్రామంలో ప్రజలందరు శాంతియుతంగా ఉండి, ఐక్యంగా ఉంటూ గ్రామాభివృద్ధికి పాటుపడేవారు. మన గ్రామంలో ఎలాంటి గొడవలు వుండేవి కాదు. పోలీస్‌స్టేషన్‌కు వెళ్లే అవసరం వచ్చేది కాదు. చిన్నచిన్న సమస్యలు వచ్చినా ఊరి పెద్దల సమక్షంలో సామరస్యంగా పరిష్కరించుకునేవారు. ఇప్పుడు మనం జరుపుకునే గణేష్ ఉత్సవాలు అప్పట్లో సారు రేగడిమట్టితో వినాయకుని విగ్రహం చేసేవారు. విద్యార్థులు పసుపు, కుంకుమ, గంధం కలిపి స్వస్తిక్ గుర్తుతో పుస్తకాలను అలంకరించి గణేష్ విగ్రహం ముందు ఉంచి పూజలు చేసేవారు. దసరా ముందు 'అయ్యవారికి చాలు ఐదు వరహాలు, పిల్లలకు చాలు పప్పు బెల్లాలు...' అంటూ చదువుకునే పిల్లలు పాటలు పాడుతూ ఇంటింటికి తిరిగేవారు. దేవుడి దీవెనలు పొంది అందరూ సుభిక్షంగా ఉండాలని కోరుకునేవారు.

శ్రీరామనవమి, శుభకార్యాల వంటి కార్యక్రమాలలో స్వచ్ఛందంగా పాల్గొని మండపాలు అలంకరణ చేసేవారు. ఆ విధంగా శేషగిరిరావుసారు గ్రామంలో ఉన్నంతకాలం అన్ని రంగాలలో గ్రామస్తులతో మమేకమై గ్రామం ఐక్యంగా ఉండే విధంగా పాటుపడ్డారు.





# సంస్కృతి-సంప్రదాయం

## మన పండుగలు

సమిష్టి భావనకు సంఘజీవనానికి శ్రేయస్కరం. నువ్వనీ, నేననీ వాదులాడుకునే కన్నా మనం అనుకున్నప్పుడు ఈ లోకమే స్వర్గతుల్యమవుతుంది. మన మధ్య ఐకమత్యాన్ని పెంపొందింప జేసేవి పండుగలు. వాటి అంతరార్థాన్ని తెలుసుకుని ఆచరిస్తే మన వ్యక్తిత్వం వికసిస్తుంది. జీవితం సార్థకమవుతుంది.

### ఉగాది ఊసులు

చైత్ర మాసంలో ఉగాది, శ్రీ రామనవమి, హనుమాన్ జయంతి పండుగలు వస్తాయి. ఉగాది పచ్చడి షడ్రుచుల్లో చేదు కూడా ఒకటి. జీవితం సుఖదుఃఖాల సమ్మిళితమనే భావన ఇందులో ఉంది.

తెలుగువారి తొలి పండుగ ఉగాది. ఈ ఉగాది యుగాది అనే సంస్కృత పదానికి వికృతం. యుగానికి ఆది కాబట్టి యుగాది అయింది. ఆరు రుచుల్లోని అంతరార్థాన్ని జీవితానికి అన్వయించుకుని, షడ్గుణాలకు అతీతంగా తోటివారితో కలిసి నడవమని ఉద్బోధించేది తెలుగు ఉగాది.

వేపపూత రెమ్మలు, లేత మామిడి ముక్కలు, అశోక వృక్షం చిగుళ్లు, కొత్త బెల్లం, కొత్త చింతపండు పులుసు, చెరుకు ముక్కలు, జీలకర్ర, పటికబెల్లం, ఉప్పు, శనగలు, పాలు ఇంకా కొబ్బరి ముక్కలను కలిపి తయారుచేసేదే ఉగాది పచ్చడి. దీన్ని మనం తీసుకోవడమే కాకుండా బంధుమిత్రులకు కూడా పంచి పెడితే సంవత్సరమంతా శుభఫలం అందరికీ కలుగుతుంది. ఈ విధంగా మన గ్రామంలోని అన్ని కుటుంబాలవారు ఉగాది పచ్చడిని తీసుకున్నాక పెద్దల ఆశీర్వచనం పొందుతారు. తర్వాత అయ్యగారు ఊరి పెద్దల సమక్షంలో పంచాగ శ్రవణం చేస్తారు. సంవత్సరపు మంచిచెడు తెలిపేది పంచాంగం. దీనితో తిధి, వార, వర్ణం, కాలపరిస్థితి, ఆదాయ వ్యయాలు తెలుసుకుంటారు. తెలుగునాట తెలుగుదనం తరిగిపోతున్న తరుణంలో మన తొలి పండుగ గొప్పతనాన్ని గుర్తుచేసుకోవడం అవసరం.

### శ్రీరామ నవమి

శ్రీరామనవమి కళ్యాణోత్సవానికి గ్రామంలోని ప్రజలంతా ఎంతో భక్తిశ్రద్ధలతో వారంరోజుల పాటు శ్రీరామదాసు కీర్తనలతో అఖండానికి జ్యోతివెలిగించి ఊరంతా వీధులలో భజనలు చేస్తారు. భజనలు చేయడానికి గ్రామంలోని భక్తులు, యువకులు ఉత్సాహంతో వారం రోజులపాటు సందడి చేస్తారు. గ్రామంలోని పెద్దలు గుత్తికొండ రంగారెడ్డి,





రామినేని గుర్వయ్య, మేకపోతుల లక్ష్మయ్య, బొల్లెద్దు సైదులు, అంకం రాములు, కట్ల గురువులు, చింతకుంట్ల లక్ష్మీనర్సు, బోయ అయోధ్య రామిరెడ్డి, పెరుమాళ్ల వెంకటరాములు, చింతకుంట్ల భిక్షం, నారాయణ పుల్లారెడ్డి, అంకం సూరయ్య, గుత్తికొండ్ల సుదర్శన్‌రెడ్డి, నారాయణ భద్రారెడ్డి, యడవెళ్ళి రంగారెడ్డి, మేకపోతుల పిచ్చయ్య, మేకపోతుల వెంకన్న, జిల్లేపల్లి రాములు, రామదాసు కీర్తనపాటలు పాడి భజనలతో రక్తికట్టించేవారు.

శ్రీరామనవమి రోజున గ్రామస్థులందరు ఎంతో వైభవంగా శ్రీసీతారామచంద్రస్వామి కళ్యాణం చేస్తారు. శ్రీ సీతారాముల కళ్యాణంలో గ్రామంలోని ఆసక్తిఉన్న దంపతులు పీటలపై కూర్చుని కళ్యాణాన్ని నిర్వహిస్తారు. గ్రామ పురోహితుడు అభిజిత్ లగ్న సుమూర్తాన వేద మంత్రాలు, మంగళ వాయిద్యాలు, భక్తుల జయజయద్వానాల నడుమ సీతారాముల కళ్యాణం జరుగుతుంది. కళ్యాణం జరిగిన తదుపరి దేవుని తీర్థప్రసాదాలు భక్తులందరికి పంచిపెడతారు. అన్నదానం చేస్తారు. భక్తులందరూ దేవుడికి కట్నాలను, కొబ్బరి కాయలను ఎవరికి తోచినంత వారు సమర్పించి భగవంతుని దీవెనలు పొందుతారు.

తిరిగి సాయంత్రం భజనతో భగవంతుని ఊరేగింపుతో గ్రామమంతా కలియ తిరిగి మరింత శోభాయమానంగా మహోత్సం



నిర్వహిస్తారు. శ్రీరామ నవమి వేడుక హరిజనవాడలలో కూడా వారి దేవాలయలలో ఘనంగా చేసుకుంటారు.

### ముత్యాలమ్మ పండుగ

మన గ్రామంలో ముత్యాలమ్మ పండుగ శ్రావణమాసంలో శుక్రవారం రోజున చాకలి, మంగలి వాళ్ళు చల్లకుండ ఎత్తుకొని ఇంటింటికి తిరిగి ఆ కుండలో చల్లను సేకరిస్తారు. సేకరించిన చల్లకుండ, సద్ది అన్నం ముత్యాలమ్మకు ఊళ్లో ఉన్న ముత్యాలమ్మకు పెడతారు. ఆ విధంగా శుక్ర, శని, ఆదివారాలు చేస్తారు. ఆదివారం బొడ్రాయి కాడ, కోటమైసమ్మ దగ్గర కూడా గొర్రెను బలి ఇస్తారు. బలి ఇచ్చిన గొర్రెను చాకలివాళ్ళు, కుమ్మరి, మాదిగలు పంచుకుంటారు. మంగలాయన సాంబ్రాణి పొగతో మైసమ్మకు తిప్పి ముత్యాలమ్మ దీవెనలు పొందుతారు.

ఆదివారం రోజు సాయంత్రం ఇంటింటికి మొక్కుకున్న కోడిపుంజులను ముత్యాలమ్మ దగ్గర కోసుకొని మొక్కులు చెల్లిస్తారు. తెల్లారి సోమవారం రోజు గ్రామస్థులందరూ తమ పంటపొలాలు, తోటల వద్దకు వనభోజనాలకు వెళ్లి ముత్యాలమ్మ పండుగను ఘనంగా జరుపుకుంటారు.

### విఘ్నాలు తేర్చే గణపతి

బ్రహ్మతో సహా సమస్త దేవతలు ఏ పని తలపెట్టినా వినాయకుని





పూజించకపోతే కృతకృత్యులు కాలేరట. వినాయకుడంటే విఘ్నాలు పోగొట్టే దేవుడు. అందరినీ సన్మానంలో నడిపేవాడు గణపతి. ప్రమధ గణాలకు అధిపతి. వినాయక చవితి రోజున మన గ్రామంలో వాడవాడలా గణనాథుని విగ్రహాలు వుంచి నవరాత్రులు భక్తిశ్రద్ధలతో పూజలు చేస్తారు. ప్రతిరోజు తప్పకుండా పూజలు నిర్వహిస్తారు. గణనాథుని వేదికల వద్ద కోలాటాలు, డ్యాన్సులతో హడావుడి చేస్తారు. అన్నదానాలు నిర్వహిస్తారు. తొమ్మిదిరోజుల తర్వాత ఉత్సవాలు నిర్వహించి పదవరోజు నిమజ్జనం చేస్తారు. నిమజ్జనం రోజున గ్రామంలోని భక్తులందరు తమ వీధికూడళ్లలో వున్న గణేష్‌ని మహిళల కోలాటాలు, పిల్లల డ్యాన్సులు, యువకులు డీజే పాటలతో ఉత్సాహంగా నిమజ్జనం చేస్తారు.

### బతుకమ్మ పండుగ

తెలంగాణ సంస్కృతి, సంప్రదాయాలకు నిలువుటద్దమైన గొప్ప వేడుక బతుకమ్మ పండుగ. దుర్గా నవరాత్రులకు ఒకరోజు ముందుగానే గౌరమ్మ పేరిట బతుకమ్మ పండుగకు అంకురార్పణ జరుగుతుంది.

మన తెలంగాణాలో ఘనంగా జరుపుకునే పండుగ బతుకమ్మ. ఈ పండుగను తొమ్మిది రోజుల పాటు జరుపుకుంటారు. ఇది మహాలయ అమావాస్య రోజు ప్రారంభమై దుర్గాష్టమి రోజు ముగుస్తుంది. తెలంగాణ సంస్కృతికి ప్రతీక ఈ పండుగ. రంగురంగుల పూలతో త్రికోణాకారంలో



పేర్చి అలంకరించిన బతుకమ్మల చుట్టూ చప్పట్లుచరుస్తూ వలయంగా తిరుగుతూ బతుకమ్మ పాటలు పాడతారు. మన గ్రామంలో కూడా ఈ తొమ్మిది రోజులు తంగెడుపువ్వు, మందార, గడ్డిపూలు సేకరించి అందంగా బతుకమ్మలను అలంకరిస్తారు. బొడ్డెమ్మతో మొదలు ఎంగిలిపువ్వు బతుకమ్మ, సద్దల బతుకమ్మ.... ఇలా దేని ప్రత్యేకత దానిదే. తొమ్మిదిరోజుల పాటు కొనసాగే బతుకమ్మలను మన ఊళ్ళో చినచెరువులో నిమజ్జనం చేస్తారు. 'బతుకమ్మ బతుకమ్మ ఉయ్యాలో' అని సాగే ఈ పాటల్లో మహిళలు తమ కష్టసుఖాలు, ప్రేమ, స్నేహం, బంధుత్వం, ఆప్యాయతలను తెలియజేస్తారు.

తొమ్మిది రోజుల పాటు బతుకమ్మలకు నైవేద్యాలు పెడతారు. ఎంగిలి బతుకమ్మ, అటుకుల బతుకమ్మ, ముద్దపప్పు బతుకమ్మ నానే బియ్యం బతుకమ్మ, అట్ల బతుకమ్మ అలిగిన బతుకమ్మ, వేపకాయల బతుకమ్మ, వెన్నముద్దల బతుకమ్మ సద్దల బతుకమ్మ, పేర్లతో తొమ్మిది రోజుల ఆడతారు. మన గ్రామంలో కీ॥శే॥ సోమిరెడ్డి రఘునాధమ్మ, గుత్తికొండ సుశీలమ్మ, గుత్తికొండ లీలమ్మ, చల్లా వెంకటమ్మ ఈ పూల పండుగను ముందుండి నిర్వహిస్తారు. గ్రామ మహిళలందరు కలిసి కులమతాలకతీతంగా ఈ పండుగ జరుపుకుంటారు.

## దసరా



జయీభవ - విజయీభవ. సంస్కృతి నిండుగా... దసరా పండుగ. శ్రమిస్తూ సేదదీరడం, విరామంలో వినోదాన్ని ఆస్వాదించడం, వ్యవసాయం జీవనాధారమైన ఏ దేశంలోనైనా ఇదే పండుగల పరమార్థం.

పేరులో సరదాను స్ఫురించే దసరా, పనిచేసే వారికోసమే పండుగ



అని చాటి చెబుతుంది. ఆషాడం, శ్రావణం, భాద్రపదాల్లో - సేద్యంలో తలమునకలైన రైతులోకాన్ని ఆశ్వయుజమాసంలో ఊపిరి తీసుకోమంటుంది. నీడపట్టున కొద్దిపాటి విరామాన్నిస్తుంది. బతుకమ్మ పాటలు, అయ్యవార్లకిచ్చే అయిదు వరహాలు, పిల్లలకు పంచే పప్పు బెల్లాలు - పాలపిట్టను చూసేందుకు పొలిమేర ఉరుకులు... శమీ దర్శనాలు... పరస్పర ఆలింగనాలతో జమ్మిఆకు (బంగారం)తో పంచుకుంటూ సంతోషంగా జరుపుకుంటారు.

మన గ్రామంలో కూడా గ్రామస్థులందరు వేకువ జామునే స్నానమాచరించి నూతన వస్త్రాలు ధరించి శమీ పూజలు నిర్వహిస్తారు. అంతా శుభం జరగాలని పాలపిట్టను చూస్తారు. దసరా సందర్భంగా గ్రామంలో కీ॥శే॥ మేకపోతుల లింగయ్య పి.ఇ.టి జ్ఞాపకార్థం ఆటలపోటీలు, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తారు. దసరాకు తప్పనిసరిగా ప్రతి ఇంటిలో గారెలు చేస్తారు. యాటలు కోసుకుని దసరా పండుగను ఎంతో ఘనంగా జరుపుకుంటారు. శ్రీ సాయి గణేష్ యూత్ ఆధ్వర్యంలో, బిల్ల రామన్న ఇంటి దగ్గర గత పది సంవత్సరాలుగా దేవి నవరాత్రి ఉత్సవాలు ఘనంగా నిర్వహిస్తున్నారు. గణేష్ యూత్ కమిటీ వారు కూడా పాత మినరల్ వాటర్ ప్లాంట్ వద్ద దేవి నవరాత్రి ఉత్సవాలు గత మూడు సంవత్సరాలుగా నిర్వహిస్తున్నారు.

## వెలుగులు నింపే దీపావళి

మన సంస్కృతిని ప్రతిబింబించేవి పండుగలు. అందులోనూ వెలుగుల విందులు చేసేది దీపావళి. కాల్చేవి, పేల్చేవి ఎన్ని ఉన్నా రకరకాల దీపాల వరుసలు చూడడమే కళ్లకు వేడుక. అసలు దీపావళి అంటేనే దివ్వెల వరుస. శ్రీకృష్ణుడు సత్యభామ సమేతంగా వెళ్లి నరకాసురుడిని చంపిన రోజు నుంచి దీపావళి చేసుకోవడం ప్రారంభమైంది. దీపావళి నాడు మన ఊరిలో నోములు ఉన్నవారు లక్ష్మీపూజను వైభవంగా చేస్తారు. లక్ష్మీని ఇంటికి ఆహ్వానిస్తూ మంగళహారతులతో నివాళులు పడతారు. గ్రామంలోని ఇండ్లన్నీ దీపాలతో, పూల మాలలతో అలంకరించుకుంటారు. రాత్రిపూట పెద్దలు, పిల్లలు టపాసులు కాల్చుతూ ఆనందంతో వేడుకను జరుపుకుంటారు.

## సంక్రాంతి

సంతోషాలు నిండగా... ఆడిపాడే పండుగ. పల్లె ప్రజలకు ఇదొక మధురానుభూతి. భోగి, సంక్రాంతి, కనుమ పేర్లతో మూడు రోజులపాటు ముంగిళ్లను ముగ్గులతో తీర్చిదిద్దుతారు. ముగ్గుల్లో గొబ్బెమ్మలను ఉంచుతారు. విందులు, వినోదాలతో గ్రామంతా సందడే సందడి. ఆడబిడ్డల హడావుడి, అల్లుళ్ళ సరదా అలకలతో గ్రామ లోగిళ్లు కళకళలాడే సమయమిది.

సంక్రాంతి రోజున హరిదాసు కీర్తనలు, గంగిరెద్దులవారి సన్నాయి మేళాలు, కోలాటాలతో ఆనందోత్సహాలతో జరుపుతారు.

పుష్య మాసంలో సంక్రాంతి వస్తుంది. ఈ కాలంలో ఉత్తర ద్వారాలు తెరచుకుంటాయి. ఏ శుభకార్యమైనా ఉత్తారాయణంలోనే చేస్తారు. పంట చేతికి వచ్చి ఆరోగ్యం చక్కబడుతుంది. భోగిరోజున భోగిమంటలు వేసి మనలోని దుష్ట సంస్కారాలను అగ్నిలో దహనం చేసే ఉద్దేశంతో ఇలా చేస్తారు. మన గ్రామంలో అరిసెల పాకాలలో ప్రతి ఇల్లు ఘుమాళిస్తుంది. పిండివంటలు చేసుకుని, ఆనందంగా ఇంటిల్లిపాది పండుగను మూడు రోజులు ఘనంగా జరుపుకుంటారు.

## శివరాత్రి

మాఘమాసం అంటే పాపం లేనిది. దేహేంద్రియాలు చేసే కర్మలతో ఆత్మకు సంబంధం లేదని నిర్ణయించే నెల మహాశివరాత్రి. ఆ రోజు గ్రామంలోని ప్రజలందరూ సమీప శివాలయాలను దర్శించుకుని తరిస్తారు. ఒక్క పొద్దు వుండి తమ భక్తిని ప్రదర్శిసారు. నాగులపహాడ్, పొనుగోడు, సోమేశ్వర ఆలయాలు సందర్శించి శివనామ స్మరణతో, జాగారాలతో శివరాత్రి వేడుకను జరుపుకుంటారు.

## హోళి

రంగుల జీవితంలో హోళి. ఫాల్గుణంలో హోళి వస్తుంది. కామదహనం చేసే పండుగ. కామదహనం చేసి వసంతపూర్ణిమ చేయాలి. కామదహనం ముందు కోలాటాలతో వారంపాటు పిల్లలు ఇల్లిల్లు తిరిగి



'ఓయ్ ఓయ్ రాంరెడ్డి, పదారెడ్ల బండికట్టి' అంటూ పాటలు పాడుతూ పెద్దల వద్ద ఇనాము పొందుతారు. హోళి ముందురోజు కామదహనం చేస్తారు. హోళి రోజున అందరూ రంగురంగుల నీళ్లతో రంగులు గుప్పుకుంటూ ఆనందోత్సాలతో హోళిని జరుపుతారు.

## పీర్ల పండుగ – 'మొహరం'

మహ్మదీయుల ప్రధాన పర్వదినాలలో మొహరం ముఖ్యమైనది. హసన్ హుస్సేన్ అనే ముస్లిం వీరుల స్మారకార్థం శోకతప్త హృదయాలతో జరుపుకునే కార్యక్రమమే పీర్లపండుగ మొహరం. ముస్లిం పంచాగరీత్యా అరేబియాలో సంవత్సరం మొదటి తేది మొహరం. మొహరం పండుగనే పీర్ల పండుగ అని కూడా అంటారు. పీర్ అంటే మహాత్ములు– ధర్మ నిర్దేశికులు అని అర్థం.



ఈ పండుగలో ప్రతిరోజూ ఆ పీర్ల పంజాలను సాంబ్రాణి ధూపంతో పూజిస్తారు. పీర్లను దర్శించడానికి పిల్లలు, పెద్దలు వచ్చిపోతూ వుంటారు. మతబేధాలకు అతీతంగా హిందువులు కూడా ఈ పండుగలో పాల్గొంటారు.

మన గ్రామంలో ఈ పీర్ల పండుగను ఎంతో ఘనంగా జరుపుతారు. పీర్లను మసీదు నుండి బయటికి తీసి విచార వదనాలతో, సన్నాయి

మేళంలో శోకగానం చేస్తూ ఊరంతా ఊరేగింపుకు బయలుదేరుతారు. ప్రతివారు సాంబ్రాణి ధూపంతో హారతినిచ్చి, కానుకలు ఇచ్చి హసన్, హుస్సేన్‌లకు జోహారులర్పిస్తారు.

ఊరేగింపు అయిన తరువాత రాత్రికి ఊరు మధ్యలో నున్న నిప్పులు గుండం దగ్గరకు వస్తారు. హైసాయ్-జూలోయ్ (అస్సోయ్ దులోయ్) అంటూ ఆవేశపు కేకలతో పీర్లను చేతబట్టి నిప్పుల గుండం మధ్య నుండి నడిచిపోతారు. ఇలా నిప్పుల గుండంలో నడిచివెళ్ళడం పీర్ల మహాత్మ్యంగా కీర్తిస్తారు. ఇలా పీర్ల పండుగ ముగుస్తుంది.

## అచలాశ్రమం

మన గ్రామంలో కొంతమంది ఆధ్యాత్మిక భావనతో శ్రీ సంకోజు రామచంద్రచార్యులు, షేక్ మస్తాన్ గురువులు 1977 సంవత్సరంలో ఏర్పాటు చేశారు. మన గ్రామం నుండి నారాయణ యశోదమ్మ, నూకల అప్పారెడ్డి, గుత్తికొండ దామోదర్‌రెడ్డి, గుత్తికొండ నర్సమ్మ, నారాయణ పుల్లారెడ్డి, గుత్తికొండ అమృతారెడ్డి, గుత్తికొండ సుశీలమ్మ, యగ్గడి చిన సత్యమయ్య, బంగారు లక్ష్మినర్సమ్మ, కట్ల గురువులు, కట్ల ఎల్లమ్మ తదితరులు కలిసి ఆశ్రమంలో శివరామ దీక్షితులు స్వామి వారికి ప్రతి రోజు ఆరాధన కార్యక్రమాలు నిర్వహిస్తారు. ప్రతి శివరాత్రి రోజున ప్రత్యేక ఆరాధనా కార్యక్రమాలు నిర్వహిస్తారు.





## రామాలయం పునర్ నిర్మాణం

మన గ్రామంలో రామాలయం పూర్వం నూకల అప్పారెడ్డి ఇంటి పక్క గల బేరం రాంరెడ్డి ఇంటి దగ్గర ఉండేది. తర్వాత కాలంలో దానిని ఎడవెల్లి లచ్చిరెడ్డి ఇంటి దగ్గరకు మార్చారు. కొత్త రామాలయాన్ని మన గ్రామ ప్రవాసులు, దాతలు, గ్రామ రైతుల సహకారంతో 2007



సంవత్సరంలో నారాయణ జానకిరాంరెడ్డి, నారాయణ భద్రారెడ్డి పాత ఇంటి అడుగు స్థలంలో నిర్మించారు. నూతన రామాలయ నిర్మాణానికి ఎడవెల్లి నిర్మల రవిందర్‌రెడ్డి, పోరెడ్డి హైమ చంద్రశేఖర్ రెడ్డి, వంగాల కవిత సురేందర్‌రెడ్డి, వంగాల జ్యోతి రవీందర్ రెడ్డి, మారుపాకల జ్యోతి రఘుమారెడ్డి, గ్రామంలోని ప్రతిరైతు ప్రతి కుటుంబం గడగడపకు విరాళాలు స్వీకరించారు. ఎంతో ప్రతిష్ఠాత్మాకంగా చేపట్టిన నూతన రామాలయ నిర్మాణానికి రిటైర్డ్ టీచర్ నారాయణ సత్యనారాయణరెడ్డి గుత్తికొండ బిక్షంరెడ్డి ముందుండి తోడ్పాడునందించారు. అదే సంవత్సరం మన పూర్వీకులు చాలా కాలం క్రితం వేయించిన పాత బొడ్రాయిని తిరిగి వడ్ల పుల్లయ్య ఇంటి దగ్గర నూతన బొడ్రాయి ప్రతిష్ఠ కూడా జరిగింది. 2007 సంవత్సరంలో శ్రీ సీతారామాంజనేయ దేవాలయం, ధ్వజస్థంభ ఆరోహణం, బొడ్రాయి కార్యక్రమాలు ఎంతో వైభవంగా కన్నుల పండుగగా జరుపుకొని గ్రామస్థులందరు తమ ఐక్యతను, భక్తిని

చాటుకున్నారు. 2019 సంవత్సరంలో రామాలయానికి అందమైన రంగులతో అలంకరించారు. ఈ కార్యక్రమానికి రిటైర్డ్ టీచర్ ఎదుళ్ల అంజిరెడ్డి సారు చినకూతురు మారుపాకల జ్యోతి రఘుమారెడ్డి దంపతులు, మరియు గ్రామస్థులు కలిసి సుమారు ఐదు లక్షల రూపాయలు వెచ్చించి ఆలయాన్ని సుందరంగా తీర్చిదిద్దారు.

## గాంధీ విగ్రహ ఏర్పాటు

మన గ్రామం మొదటి నుండి శాంతియుతంగా, ప్రశాంతంగా అన్ని మతాలవారు కులాలవారు కలిసికట్టుగా ఐక్యంగా వుంటారు. అందరూ సమిష్టిగా గ్రామాభివృద్ధికి పాటుపడుతుంటారు. దానిని స్ఫూర్తిగా తీసుకొని అహింసావాది, శాంతి స్వరూపుడు జాతిపిత మహాత్మగాంధీ విగ్రహం ఉండాలని భావించి బాపుజీ సేవా సంఘం పేరిట స్వచ్ఛంద సంస్థను ఏర్పాటు చేసి యగ్గడి శ్రీనివాస్, మేకపోతుల సైదులు యల్.ఐ.సి., రామినేని ఆనంద్, అనుమోజు శ్రీనివాసచారి, యడవెల్లి సంజీవరెడ్డి, యడవెల్లి ప్రభాకర్‌రెడ్డి, యడవెల్లి లక్ష్మారెడ్డి, మేకపోతుల లింగయ్య, మేకపోతులు శంకర్, యగ్గడి సంపత్, రామినేని కిరణ్, రామినేని అరవింద్, దాచేపల్లి నాగయ్య, అప్పటి సర్పంచ్ మేకపోతుల పిచ్చయ్య, మేకపోతుల సీతారాములు, సుదిరెడ్డి సత్యనారాయణ రెడ్డి, గ్రామస్థుల ఆర్థిక సహాయంతో ఏర్పాటు చేసుకోనైనది.





## గంగమ్మ గుడి



మన గ్రామానికి చెందిన యాదవ కులస్థులు తమ ఆరాధ్యదైవం గంగమ్మ దేవతకు గుడి నిర్మించారు. దీనిని 2019 జూన్ నెలలో గ్రామలోని సర్పంచ్, యం.పి.టి.సి. ఉద్యోగులు, గ్రామ పెద్దలు, యాదవ కులస్థుల ఆర్థిక సహకారంతో ప్రతిష్ఠ చేశారు. జూన్ 18, 19, 20, 2019లో గంగమ్మ గుడి ప్రారంభ వేడుకలు ఎంతో కనులపండువగా గ్రామస్థులందరూ జరుపుకున్నారు.

## మసీద్



మన గ్రామం ఏర్పడిన నాటినుంచి ముస్లింలు ఎలాంటి అరమరికలు లేకుండా గ్రామస్థులతో సామరస్యంగా మెలుగుతారు. అన్ని హిందు పండుగల్లో తమవంతు సహకారాన్ని అందిస్తూ వుంటారు. వీరంతా తమ ప్రార్థనలు ఇంట్లోనే చేసుకునేవారు. గ్రామ ముస్లింలంతా కలిసి తమ ఉమ్మడి ప్రార్థనలకోసం మసీదు నిర్మాణం చేసుకున్నారు. ప్రతిరోజు అక్కడ నమాజ్ చేసుకుంటూ అల్లాని స్మరిస్తారు. రంజాన్, బక్రీద్, మొహర్రంలాంటి తమ పండుగ రోజుల్లో అందరూ కలిసి పవిత్రంగా జరుపుకుంటారు.

### చర్చి



మన గ్రామ ప్రజలు మొదటినుంచీ కులమతాలకు అతీతంగా కలిసిమెలిసి జీవనం కొనసాగిస్తారు. ఎవరి మత భావనలు వారు కలిగివుంటారు. మన గ్రామంలో వున్న కొందరు క్రిస్టియన్లు తమ ప్రార్థనల కోసం చర్చిని నిర్మించుకున్నారు. ప్రతి ఆదివారం ప్రభువైన యేసు ప్రార్థనలు నిర్వహిస్తారు. వారి పండుగలైన క్రిస్మస్, గుడ్‌ఫ్రైడేలను ఆనందోత్సాలతో జరుపుకుంటారు.





# విద్యా ఫలాలు...

## ఉద్యోగుల వివరాలు

మన గ్రామంలో స్వాతంత్ర్యం అనంతరం వివిధ శాఖలలో ఉద్యోగులు పనిచేశారు. మొదటి ఉద్యోగి కీ॥శే॥ పఠాన్ బిక్షం. ఆయన పోలీస్‌గా పనిచేశారు. తర్వాత కీ॥శే॥ నారాయణ వెంకటరెడ్డి టీచర్‌గా నియమితులైనారు.

**మన గ్రామ ఉద్యోగుల వివరాలు**

| | |
|---|---|
| కీ॥శే॥ పఠాన్ బిక్షం | పోలీస్ |
| కీ॥శే॥ నారాయణ వెంకటరెడ్డి | టీచర్ |
| కీ॥శే॥ నారాయణ బక్కారెడ్డి | టీచర్ |
| కీ॥శే॥ యగ్గడి గోపయ్య | టీచర్ |
| కీ॥శే॥ బంగారు పుల్లయ్య | టీచర్ |
| కీ॥శే॥ బంగారు సత్యనారాయణ | టీచర్ |
| కీ॥శే॥ నారాయణ కోటిరెడ్డి | డిప్యూటీ కలెక్టర్ |
| కీ॥శే॥ మేకపోతుల లింగయ్య | పి.ఇ.టి. |
| కీ॥శే॥ నారాయణ కాంతారెడ్డి | టీచర్ |

| | |
|---|---|
| ఎడవెల్లి రవీందర్ రెడ్డి | జాయింట్ కలెక్టర్ రిటైర్డ్ |
| బంగారు లక్ష్మణాచారి | రిటైర్డ్ టీచర్ |
| బంగారు రామాచారి | ఎ.సి.టి.ఓ. రిటైర్డ్ |
| తడకమళ్ల మోహన్‌రావు | డాక్టర్ |
| తడకమళ్ల బిందురావు | డాక్టర్ |
| దాచేపల్లి సుధీర్ కుమార్ | డాక్టర్ |
| పుట్టల మల్లిఖార్జున్ | డాక్టర్ |
| నారాయణ సత్యనారాయణరెడ్డి | రిటైర్డ్ టీచర్ |
| ఎదుళ్ల అంజిరెడ్డి | రిటైర్డ్ టీచర్ |
| తడకమళ్ల మచ్చయ్య | పబ్లిక్ ప్రాసిక్యూటర్ |
| తడకమళ్ల లక్ష్మినర్సింహరావు | వి.ఆర్.ఓ.రిటైర్డ్ |
| తడకమళ్ల దయాకర్‌రావు | బ్యాంక్ మేనేజర్ |
| తడకమళ్ల కరుణాకర్‌రావు | బ్యాంక్ ఆఫీసర్ |
| చల్లా వెంకటరెడ్డి | టీచర్ |
| తడకమళ్ల రమాదేవి | అడ్వకేట్ |
| బంగారు విజయ్ కుమార్ | సూపరింటెండెంట్ మెప్మా |
| ఎడవెల్లి సురేందర్‌రెడ్డి | టీచర్ |
| జిల్లేపల్లి జానయ్య | టీచర్ |
| యగ్గడి సునీత దేవి భర్త: శ్రీనివాస్ | టీచర్ |
| యగ్గడి శ్రీనివాస్ తండ్రి: గోపయ్య | టీచర్ |
| యగ్గడి శ్రీనివాస్ | టీచర్ |
| ఎడవెల్లి ప్రభాకర్ రెడ్డి | టీచర్ |
| యడవెల్లి లక్ష్మారెడ్డి | టీచర్ |
| కట్ల మధుసూధన్ | టీచర్ |
| నారాయణ అరుణ | టీచర్ |



| | |
|---|---|
| తడకమళ్ల జ్యోతి | టీచర్ |
| మందుగుల కవిత భర్త : నాగయ్య | టీచర్ |
| తాళ్ళపాక రాములు | టీచర్ |
| నారాయణ పుల్లారెడ్డి | వి.ఆర్.ఓ. |
| యగ్గడి జానకిరాములు | ఆర్టీసీ డ్రైవర్ |
| కట్ల రాములు తండ్రి: బిక్షమయ్య | విశాఖ స్టీల్ ప్లాంట్ |
| మేకపోతుల శంకర్ | ఎ.యస్.ఐ |
| నారాయణ సందీప్‌రెడ్డి | యస్.ఐ. |
| నారాయణ వెంకటరెడ్డి | హెడ్ కానిస్టేబుల్ |
| రామినేని కిరణ్ | కానిస్టేబుల్ |
| రామినేని అరవింద్ | కానిస్టేబుల్ |
| యగ్గడి గురునాథం | హెడ్ కానిస్టేబుల్ |
| మేకపోతుల జానయ్య | హోమ్‌గార్డు |
| యెడవెల్లి అశోక్ రెడ్డి | హోమ్‌గార్డు |
| దాచేపల్లి సురేష్ | కానిస్టేబుల్ |
| మేకపోతుల వినోద్ | ఫారెస్ట్ బీట్ ఆఫీసర్ |
| రామినేని శ్రీలత | సీనియర్ అకౌంటెంట్ |
| పఠాన్ జబ్బర్‌ఖాన్ | టి.ఎస్.ఓ. |
| దాచేపల్లి ప్రియాంక శ్రీధర్ | హెల్త్ సూపర్‌వైజర్ |
| రాచూరి సుజనిత | జూనియర్ వెటర్నరీ ఆఫీసర్ |
| దాచేపల్లి శ్రీధర్ | రైల్వే టెక్నిషియన్ |
| డాచేపల్లి కిషోర్ | రైల్వే టెక్నిషియన్ |
| మేకపోతుల మహేష్ | రైల్వే టెక్నిషియన్ |
| బంగారు రాధిక | అంగన్‌వాడీ సూపర్‌వైజర్ |
| ఆదిమల్ల కుమారి ఆయోధ్య | అంగన్‌వాడీ టీచర్ |

| | |
|---|---|
| కూకుంట్ల మంజుల సైదులు | అంగన్‌వాడీ టీచర్ |
| మేకపోతుల అజయ్ | సీనియర్ అసిస్టెంట్ |
| దాచేపల్లి నరేష్ | సెక్రటరీ |
| డాక్టర్ గంగారపు సతీష్ | స్టాఫ్ రిసెర్చ్ సైంటిస్ట్ |
| డాక్టర్ కట్ల శంకర్ | సీనియర్ జియాలజిస్ట్ |
| యగ్గడి సంపత్ కుమార్ | సంఘమిత్ర డిగ్రీ కాలేజి ప్రిన్సిపాల్ |
| యడవెల్లి అఖిల్ రెడ్డి | ఇవెంట్ మేనేజర్ |
| నారాయణ సాంబారెడ్డి | సాఫ్ట్‌వేర్ |
| కట్ల మహేష్ | సాఫ్ట్‌వేర్ |
| యడవెల్లి క్రాంతిరెడ్డి | సాఫ్ట్‌వేర్ |
| యడవెల్లి శ్రీనివాసరెడ్డి | సాఫ్ట్‌వేర్ |
| మేకపోతుల జగదీష్ | సాఫ్ట్‌వేర్ |
| మేకల శ్రవణ్ | సాఫ్ట్‌వేర్ |
| మేకల అరవింద్ | సాఫ్ట్‌వేర్ |
| యగ్గడి నవీన్ | సాఫ్ట్‌వేర్ |
| రామినేని అనిల్ కుమార్ | సాఫ్ట్‌వేర్ |
| యడవెల్లి శ్రీనివాసరెడ్డి | సాఫ్ట్‌వేర్ |
| యగ్గడి తేజవర్మ | సాఫ్ట్‌వేర్ |
| నారాయణ చినసాంబారెడ్డి | ఫ్యాకల్టీ |
| నారాయణ రాంరెడ్డి | వివేకానంద స్కూల్ |
| యగ్గడి నాగయ్య | అక్షర స్కూల్ ప్రిన్సిపాల్ |
| యగ్గడి యాదయ్య | ఫ్యాకల్టీ |
| యగ్గడి వెంకటేశ్వర్లు | సెక్యూరిటీ, జిఎంఆర్ |
| మేకపోతుల మధు | మేనేజర్, కన్‌స్ట్రక్షన్ |
| ఆదిమల్ల వెంకన్న | ఫ్యాకల్టీ |
| నారాయణ గోపిరెడ్డి | సెరికల్చర్ ఆఫీసర్ |



### ఉన్నతవిద్య (పోస్టుగ్రాడ్యుయేషన్) అభ్యసిస్తున్న విద్యార్థులు

మేకపోతుల విక్రమ్, మేకపోతుల వంశీ, కంచి విజయ్, దాచేపల్లి వినోద్, నారాయణ వీరేందర్‌రెడ్డి, జూకూరు నరేష్. వీరితో పాటు మన గ్రామంలో పదిమంది ప్రముఖ కంపెనీలలో యం.టెక్. యం.బి.ఎ. అర్హతలతో సాఫ్ట్‌వేర్, బిజినెస్ ఎనలిస్ట్‌లుగా పనిచేస్తున్నారు. వివిధ డిగ్రీలు, బి. టెక్, డిగ్రీ పోస్ట్ గ్రాడ్యుయేట్ వంటి కోర్సులు చేస్తున్నవారు ముప్పై మంది వరకు ఉన్నత విద్య నభ్యసిస్తున్నారు.

### విదేశాల్లో మన ఊరివాళ్లు

మన గ్రామంలో విదేశీ విద్య కొరకు అమెరికా, కెనడా, లండన్, ఆస్ట్రేలియా వంటి దేశాలలో వెళ్ళి అక్కడ స్థిరపడి ఉన్నత స్థాయిలో ఉండి మన గ్రామాభివృద్ధికి సహకరిస్తున్నవారు

| పేరు | తండ్రి |
|---|---|
| మజ్జిగపు సాగర్ రెడ్డి | యల్లారెడ్డి |
| మజ్జిగపు వెంకట రెడ్డి | యల్లారెడ్డి |
| గుత్తికొండ భాస్కర్‌రెడ్డి | సుదర్శన్ రెడ్డి |
| గుత్తికొండ సతీష్‌రెడ్డి | సత్యనారాయణరెడ్డి |
| నారాయణ దయాసాగర్ రెడ్డి | మల్లారెడ్డి |
| ఎడవెల్లి నరేందర్‌రెడ్డి | అప్పారెడ్డి |
| సూదిరెడ్డి రవీందర్ రెడ్డి | సత్యనారాయణరెడ్డి |
| డాక్టర్ గంగారపు సతీష్ | రాములు |
| కటికం మల్లిఖార్జున్ | రామనాథం |
| బంగారు భావన | బంగారు బ్రహ్మం, నవ్య |
| మేకపోతుల ప్రవల్లిక | శంకర్ |
| మేకపోతుల మౌనిక | శంకర్ |
| తడకమళ్ళ సతీష్ | లక్ష్మీనర్సింహ్మారావు |
| తడకమళ్ళ అరవింద్ | మోహన్‌రావు |
| తడకమళ్ళ అశోక్ | మోహన్‌రావు |

❖ నారాయణ రామచంద్రారెడ్డి, నారాయణ వెంకటరెడ్డి, యగ్గడి గోపయ్య, నారాయణ సత్యనారాయణరెడ్డి 1969 తెలంగాణ తొలిదశ ఉద్యమంలో పాల్గొన్నారు.

❖ మేకపోతుల సైదులు, సూదిరెడ్డి రవిందర్‌రెడ్డి ఎల్.ఐ.సి. ఏజెంట్స్‌గా సేవలందిస్తున్నారు.

❖ బంగారు సుధాకర్, సీనియర్ ఎలక్ట్రీషియన్‌గా సేవలందిస్తున్నాడు.

❖ కూకుంట్ల లాల్, సూర్యాపేట జిల్లా ఫోటోగ్రాఫర్స్ అసోసియేషన్ అధ్యక్షులుగా సేవలందిస్తున్నాడు.

❖ పుట్టల శ్రవణ్, యం.ఆర్.పి.యస్.సూర్యాపేట జిల్లా అధ్యక్షులుగా సేవలందిస్తున్నాడు.

❖ ఇరుగు రవి, సూదిరెడ్డి రవీందదర్ రెడ్డి, బైరెడ్డి గోవర్ధన్‌రెడ్డి ఆర్.ఎం.పి.లుగా మన గ్రామం నుంచి సేవలందిస్తున్నారు.

❖ షేక్ యూసుఫ్,షేక్ మౌలానాలు చిన్న డబ్బాకొట్లు నడుపుతూ సామాన్యులకు అన్ని వేళలా ఊరి చిన్నచిన్న అవసరాలకు, కిరాణా సరుకులను అందించేవారు.

❖ సూర్యం, సత్యంలు టైలర్లుగా ఊరందరికీ బట్టలు కుట్టేవారు. టైలర్లుగా సేవలందించడమే కాకుండా, ఊరిలోని చాలామంది యువతీ యువకులకు టైలరింగ్ నేర్పించి, వారి స్వయం ఉపాధికి తోడ్పాటునందించారు.

❖ బంగారు బ్రహ్మం, (తండ్రి బంగారు జానకిరామయ్య) ఎలక్ట్రానిక్ మీడియాలో ఈటీవీ తెలుగు, ఎన్‌టివి, దరువు టీవీలలో పనిచేసి గోల్డెన్ టి.వి. యుట్యూబ్ ఛానల్ ప్రారంభించారు.

❖ నారాయణ రాఘవరెడ్డి, నారాయణ జనకిరాంరెడ్డి, నూకల అప్పారెడ్డి ఎక్కువ భూమిని కలిగివుండి వ్యవసాయం చేసేవారు. ఆ రోజుల్లో మనకు లిఫ్ట్ ఇరిగేషన్ వచ్చిన తరువాత వీరు మొదటి సారి మన ప్రాంతంలో మన ఊళ్ళో ట్రాక్టర్ కొని వ్యవసాయం చేసి అధిక దిగుబడులు సాధించేవారు. ఆ రోజుల్లో నారాయణ రాఘవరెడ్డి రైతులకు వ్యవసాయ పెట్టుబడులకు ఎరువులు,విత్తనాలు అందించి, పంటలు వచ్చిన తరువాత తీసుకునేవారు.



❖ మన ఊళ్లో ఏమైనా భూమి తగాదాలు, గొడవలు జరిగినప్పుడు పెద్దమనుషులుగా నారాయణ రాఘవరెడ్డి, నారాయణ జానకిరాంరెడ్డి, ఎడవెల్లి బిక్షంరెడ్డి (ఎర్రయ్య), యగ్గడి కోటిలింగయ్య, రామినేని సోమయ్య, రామినేని రాములయ్య, నారాయణ రోశిరెడ్డి ఇరువర్గాల వారిని కూర్చోబెట్టి సామరస్యంగా పరిష్కరించేవారు.

❖ బంగారు నర్సింహాచారి అద్భుత నైపుణ్యం కలిగిన స్వర్ణకారులు. ఊళ్ళో పెళ్లిల్లకు మంగళసూత్రం, మెట్టెలు, ఇతర బంగారు ఆభరణాలను తయారుచేసేవారు. మండలంలోనే పేరెన్నికగన్న ఆయన వద్దకు చుట్టుపక్కల గ్రామాల నుంచి ప్రజలు వచ్చి ఆభరణాలు చేయించుకునేవారు.

❖ బంగారు పుల్లయ్య, మందుగుల బిక్షమయ్య రైతులకు కావలిసిన నాగళ్లు, అరకలు, ఇంటి చెక్క పనిముట్లు, కర్రులు, కొడవళ్లు సరవడం లాంటి వడ్రంగి పనులు చేసేవారు.

❖ హరిజనవాడలో ఉన్న పెరుమాళ్ళ వెంకట్రాములు, ఖాసీం ఊళ్ళో ఆర్ఎంపీలుగా సేవలందించారు.

❖ మన గ్రామంలో ఆ రోజుల్లో చింతకుంట్ల లక్ష్మీనర్సు, చింతకుంట్ల బిక్షం, కట్ల బిక్షమయ్య మగ్గంపై పంచెలు నేసేవారు.

❖ నల్లగొండ కాశయ్య కామెర్ల మందు, కట్ల బిక్షమయ్య వరబీజానికి ఆపరేషన్ లేకుండా వైద్యం చేసేవారు.

❖ ఆ రోజుల్లో పుట్టల పిచ్చయ్య, పుట్టల ముత్తయ్య, పుట్టల సోమయ్య, పుట్టల పెదవెంకయ్య చెప్పులు కుట్టేవారు.

❖ ఊళ్లో డప్పు చాటింపు పుట్టల పిచ్చయ్య, పుట్టల వెంకయ్య, పుట్టల దుర్గయ్య, గంగారపు రాములు, కొండేటి వెంకయ్య చేసేవారు. మన ఊళ్ళో పండించిన వరిధాన్యాన్ని బియ్యం పట్టించడానికి, పిండివంటలకు కావలసిన పిండి పట్టించుకోవడానికి అక్కమ్మ రైస్‌మిల్‌కు వెళ్లేవారు. ఆమె కుమారుడు జల్లా విశ్వనాథం, కోడలు భద్రమ్మ మిల్లు నడిపేవారు.

❖ చాకలి ఎల్లయ్య, మేకపోతుల పెదవెంకయ్య పిల్లకు, పెద్దలకు ఆంత్రాలు కట్టడం, దడుపు మంత్రాలు వెయ్యడం చేసేవారు.

❖ తేలుకాటుకు మంగలి కొండయ్య మంత్రం వేసేవాడు.

❖ మంత్రసానులుగా పురుడుపోయడం చాకలి లచమ్మ, గొల్ల గంగమ్మ చేసేవారు. పెద్ద చదువులు చదివి ఇప్పుడు ఉన్నత స్థానాల్లో వున్న చాలా మందికి వీరే పురుడుపోశారు.

❖ పశువులకు జబ్బులు చేస్తే ఎల్లంల అంతయ్య, బేరం రామయ్య వైద్యం చేసేవారు.

❖ ఊళ్లో జంగిడి బర్లను ఎల్లంల కాశయ్య, పెరుమాళ్ళ జానయ్య కాసేవారు.

❖ నిమ్మనగోటి లింగయ్య, బిక్షమయ్య, దూపాటి నాగయ్య కుండలుచేసి ఎండాకాలం ఊరి జనాలు చల్లని నీరు తాగడానికి అందించేవారు. చిన్న పిల్లలకు మన చాయ్ కేతిరి లాగ వుంపే చిన్న బొడ్డు గురిగిలు ఇచ్చేవారు.

❖ నారాయణ కాంతారెడ్డి గ్రామ పంచాయతీ సేవకుడిగా అందరికీ సేవచేసేవారు.

❖ ప్రయివేటు టీచర్‌గా శేషగిరిరావు సారు తర్వాత గడ్డం పిచ్చిరెడ్డి సారు పిల్లలకు చదువు నేర్పించారు.

❖ గ్రామ అభివృద్ధికి ఎంతో శ్రమించి, యువతకు మార్గదర్శకులుగా వుంటూ అకాలమరణం చెందిన మేకపోతుల లింగయ్య, చల్లా విద్యాసాగర్‌రెడ్డి, చల్లా రామకృష్ణారెడ్డి, యడవెల్లి సంజీవరెడ్డి, యడవెల్లి సాంబారెడ్డి, కట్ల బిక్షం, కంచి వెంకన్న, వురిమళ్ల వెంకటబ్రహ్మాచారి, ఆదిమళ్ల శ్రీనులను స్మరిస్తూ, వారి స్ఫూర్తితో ముందుకు సాగుదాం.







# గుర్తుకొస్తున్నాయి...



## పొట్లపహాడ్‌కి అక్షర నీరాజనం

మా బుడిబుడి నడకల, తప్పటడుగుల ప్రస్థానం ప్రారంభమైందిక్కడే! ఇవ్వాళ అత్యున్నత శిఖరాలనధిరోహించిన, ఖండాంతరాల్లో ఖ్యాతినర్జించినా కడకు మా చివరి అడుగు చేరాల్సిందిక్కడే! అవును ఈ మట్టిలో మానవత్వం ఉంది - సబ్బండ వర్ణాల సంస్కృతి ఉంది. ఆర్తి, ఆనందాల తడి ఉంది - ఆత్మీయత, ఆప్యాయతల ఆర్ద్రత ఉంది. అంతరాలు లేని సమతా, మమతల సహజీవనం ఉంది. సహకారపు సంస్కారం ఉంది. తీపి జ్ఞాపకాల బాల్యం ఉంది.విడదీయలేని తల్లీబిడ్డల బంధం ఉంది. చెట్టాపట్టాలేసుకుని చిన్నప్పటి సోపతిగాండ్లతో, ఈత, తాటి, రేగుపండ్లకోసం చెట్లు పుట్టలెంట, చెలగట్టెంట, వంకలు డొంకలెంట, రాళ్ళు ముళ్ళ లెక్కచేయక, ఆకలైతే మధ్యలో దొరికిన దోసకాయలు, పెసరకాయలు, కందికాయలు తింటూ తిరిగిన మరపురాని, మరలిరాని రోజులు మన గుండెల్లో పదిలంగా ఉన్నాయి.

చేత గాలాలు పట్టి చేపలవేటకు చెఱువు, కుంట, ఏర్లెంట ఎల్లిన రోజులు ఎలా మరుస్తాం. ఆ చెట్లు పుట్టలు, చెఱువు కుంటలు వాగువంకల్నీ బాగున్నారా అంటూ పాత స్నేహితుల్లా పలకరిస్తున్నాయి మౌనంగా! నేడు. అక్షరాల భిక్షపెట్టి, సంస్కారాల సానబెట్టి రాళ్ళవంటి మనల్ని రత్నాలుగా మార్చిన సరస్వతీ లోగిలి మన బడి. మట్టి ముద్దలను, మొద్దుబుర్రలను మరమ్మత్తుచేసి, మేథో మణిమాణిక్యాలుగా తీర్చిదిద్దిన గురువుల కోవెల మన బడి మనకు గెలుపు ఓటముల జీవిత సారాన్ని నేర్పించి బాహ్యప్రపంచంలోకి పంపించిన భావితరాల కార్ఖానా మనబడి. మనకు బ్రతుకు బాటలు చూపిన పంతులయ్యలకు, ఆ సరస్వతీ నిలయానికి సాష్టంగ నమస్కారములు. కాలక్రమేణా మా బతుకు దెరువు వెతుకులాటలో నేస్తాలమందరం చెల్లాచెదురై పట్నం, నగరాలకు వెళ్లిపోయాం. మా మనసుకెపుడైనా దిగులుమొగుల్లు కమ్ముకున్నా, సమస్యల సవాళ్లు సతమతం చేసినా, వృత్తి, ఉద్యోగ వ్యాపారాల గజిబిజి మమ్మల్ని ఉక్కిరిబిక్కిరి చేసినా సక్కగా రెక్కలు కట్టుకుని ఈ అమ్మఒడిలో వాలిపోతాం. సేదతీరుతూ బాధలు మర్చిపోతాం.

పండుగ పబ్బాలకు, పెళ్ళిపేరంటాలకు విషాదాల వీడ్కోళ్ళకు అందరం కల్సుకుని సంతోషాలు - సంతాపాలు పంచుకుని బాధల బరువులు దించుకుని మరల నూతనోత్సాహ ఉత్తేజాలతో పట్నంబాట పట్టి పనులకెళతాం.

పిల్లల కోసం కాచుకునే కన్నతల్లిలా-మరల మా రాకకోసం మౌనంగా ఎదురు చూస్తుంది మా ఊరు. అమ్మలగన్న అమ్మ-అయ్యలగన్న అయ్య, తాతలగన్న తాత! తరతరాల పరంపరల చరిత్రకు సజీవ సాక్ష్యం - మా జీవితాల మూలాలకు మూలం, మన పల్లెతల్లి ఈ తీరని రుణం ఏమిచ్చి తీర్చుకోగలం-అందుకే "అక్షర పుష్పాలతో నీరాజనం" "కృతజ్ఞతలతో అభిషేకం చేద్దాం!

తల్లీ మరుజన్మంటూ ఉంటే...
వర్షించే మేఘాన్నై నీ ఒడికి చేరుతాను



చల్లని గాలినై నిన్ను ఆప్యాయంగా
స్పృషిస్తూ సేదతీరుతాను.
నీ దరికి దారి చూపి మైలు రాయినై
పొలిమేరలో నిలబడతాను
భావితరాలకు నీ ఘనతను చాటే
చరిత్ర పుస్తకంలో అక్షరాలమై దర్శనమిస్తాం.
మానవతా పరిమళాల -
మరుమల్లి కరుణతో ఆదరించు -
కల్పవల్లికట్టుబాట్లు -
కట్లు గట్లు లేని అపార ప్రేమను వర్షించు -
అమృత వల్లి చల్లని పల్లె
తల్లీ మా పొట్లపహాడ్.

**జిల్లేపల్లి జానయ్య**
స్కూల్ అసిస్టెంట్ (ఫిజిక్స్)



# ఆ రోజులు...

చిననాటి జ్ఞాపకాలే కళ్లెదుట కదులుతున్నాయి
బాల్యంలోకి తొంగి చూడమన్నాయి
గిల్లిగోనెల పిచ్చిబంతి కబడ్డీ ఖోఖో గోటీలాటలు
వొంగుడు దుంకుడు కచ్చకాయలు ఉప్పు బేతలు
పరాచకాల గెలుపోటములు
మది పులకింతగ నెమరేస్తున్నాయి

గోగు లొట్టల కట్టలేసుకుని పొలం గట్లలో
పొంకనాలలో పగ్గం పట్టిన కాకల కోపం
బావిలో తోసే పట్టువిడుపులు
నీళ్లలో ఈదుట కాళ్లు కొట్టుట కాంచీలు దుంకుడు
పుంజాట ఆడుట ముంజకాయల తోపుడు బండ్లు
కలవరింతలే పలవరింతలు
ఆటపాటల కొట్లాటల్లో ఆత్రుత పెంచేటి ఆత్మీయతలు

కొట్టివేతల కొసరు మార్కులు
ఎక్కిల్లేడ్పులు నేలచూపులు
శహబాష్ పలుకుల ఊరడింపులు



నానమ్మలు పెట్టిన వేడి ముద్దలు
నాన్నలు నేర్పిన సామరస్యతలు
తాతలు చెప్పిన కమ్మని కతలు
పున్నమి రేదులా మామల రాకలు
మిఠాయి పొట్లం లాలాజలములు

తూనీగాటలు తట్ల తాకుడులు
సైకిలెక్కుట తుర్రున జారుట
నేలముద్దల మోకాళ్ల చిప్పలు
పుటపుటాలం పసరు పూతలు
పట్టి కట్టడం గట్టిపడడం
అనుభూతంగ ఆహ్లాదంగా
విజయపు మరకల మన్ననలెన్నో
ఎదలోతుల్లో ఊయలలూగగ
పెదాల నగవై మెరుస్తున్నాయి

తాపం తీర్చేటి తీపిని పంచేటి
పల్లె సంస్కృతి ప్రణవం జగతికి
బాల్యస్మృతులే కదా మానవ ప్రగతికి

**యడవెల్లి ప్రభాకర్‌రెడ్డి**
టీచర్



# పదండి ముందుకు...

## రుణం తీర్చుకుందాం...

మన పొట్లపహాడ్ గ్రామం స్వాతంత్ర్యానంతరం 1959 సంవత్సరంలో ప్రత్యేక గ్రామపంచాయితీగా అవతరించింది. ఈ సంవత్సరానికి 60 సంవత్సరాలు పూర్తిచేసుకుని అన్ని రంగాలలో స్వయం సమృద్ధిని సాధిస్తోంది. విద్య, ఉద్యోగ, వ్యాపార మరియు వ్యవసాయ రంగంలో ఎంతో ప్రగతిని సాధించాము. ఆనాటినుండి గ్రామస్థులంతా సంఘటితమై సమిష్ఠి కృషిలో గ్రామాన్ని ఆదర్శవంతంగా తీర్చిదిద్దేందుకు కృషిచేశారు. దాని ఫలితమే మెరుగైన విద్యుత్ సౌకర్యం, డ్రైనేజ్‌లు సి.సి.రోడ్డు సురక్షిత మంచినీటి సరఫరా, ఇంటింటికి మరుగుదొడ్లు, పాఠశాల అభివృద్ధి, దేవాలయాల ఆధునీకరణ ఇలా మన గ్రామనికి కావల్సిన అన్ని సౌకర్యాలను మొదటి సర్పంచ్ నారాయణ జానకిరాంరెడ్డి నుండి ఇప్పటి సర్పంచ్ వరకు మొదటి యం.పి.టీ.సి. బోయగురువారెడ్డి నుండి ఇప్పటి యం.పి.టీ.సి వరకు పెన్‌పహాడ్ మండల జడ్.పి.టి.సి.గా పనిచేసిన రామినేని పుష్పావతి, యం.పి.పి.గా పనిచేసిన రామినేని



పుష్పావతి, మన గ్రామ మాజీ సింగిల్‌విండో చైర్మన్ సుదిరెడ్డి సత్యనారాయణరెడ్డి, మన గ్రామ నాయకులు యడవెళ్ళి యాదిరెడ్డి, వివిధ పార్టీలకు చెందిన నాయకులు తమవంతుగా మన గ్రామాభివృద్ధికి పాటుపడినారు.

మన గ్రామాభివృద్ధిలో గ్రామస్థులు, యువజన సంఘాలు మహిళా స్వయం సహాయక బృందాలు, ఉద్యోగులు అభివృద్ధిలో భాగస్వాములయ్యారు. మన గ్రామాభివృద్ధిలో మండల, నియోజకవర్గ ప్రజాప్రతినిధులు అధికారులు ఎందరో సహకారాన్ని అందించారు. ప్రభుత్వ పథకాలు, కార్యక్రమాలు పూర్తిస్థాయిలో అమలుకు కృషిచేశారు.

ఇకముందు కూడా మన గ్రామస్థులందరు రాజకీయాలకతీతంగా సూర్యాపేట జిల్లాలోనే ఆదర్శగ్రామంగా మన పొట్లపహాడ్‌ను నిలిపి ఉత్తమ గ్రామపంచాయితీ అవార్డును సొంతం చేసుకోవడానికి నడుంబిగిద్దాం. గ్రామస్థులందరం చేయిచేయి కలిపి గ్రామాన్ని ఆదర్శంగా తీర్చిదిద్దుకుందాం. గాంధీజీ కలలుగన్న గ్రామస్వరాజ్యాన్ని సాదిద్దాం.

పెద్దలు మనకు అందించిన ఆప్యాయత అనురాగాలను పంచుకుంటూ, శాంతియుత సహజీవనం కొనసాగిస్తూ, మన గ్రామాన్ని ప్రగతిపథంలో నడిపిద్దాం.

ఊరు ఎంతో ఇచ్చింది. ఎంతో కొంత తిరిగి ఇవ్వాలి. ఇలా ఇవ్వడంలో తెలియని ఆనందం ఉంది. జన్మనిచ్చిన గడ్డ రుణం తీర్చుకోవడం కంటే అదృష్టం మరొకటి ఉంటుందా చెప్పండి. ఆ దిశగా ముందుకు సాగుదాం.

*-మన పొట్లపహాడ్ గ్రామ ఐక్య సమాఖ్య*

